శుభమస్తు

హనుమత్సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న పరివార సమన్విత

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# సంగీత భక్త ప్రహ్లాద

(నాటక భజన)



ఇయ్యది

రామవర వాస్తవ్యుండును, శ్రీరామచంద్ర

సేవార్త కవిత్వ సంగీత బంధురుండును

నల్లమిల్లివంశ పయః పారావార

రాకాసుధాకరుండును

బాపిరెడ్డిగారి ప్రథమాత్మజుండు నగు

## (సహజకవి) బసివిరెడ్డిగారిచే

రచియింపఁబడి, ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు

రాయవరమున శ్రీ మేరీముద్రాలయమునందు

మల్లిడి సత్తిరెడ్డిగారిచే ముద్రింపఁబడియె.

1929

 [వెల 0—12—0

# దీనిని ముఖ్యముగా గమనింపుడు

ఈ గ్రంథముయొక్క 13వ పేజీలో 'మంచిసమయమిదియే' అను కీర్తనయందు గల 'సాదియింపరక' అను మొదటి మిత్రమునకు ముందు

### "ఎందరు వారించిన వినక-యీ<br>సుందరినెత్తుకచనెద హుటాహుటి"

అను చరణమును చేర్చుకొనవలెను.

మరియు గ్రంథకర్తగారి యనుమతిలేనిది యెవ్వరును యిందలివట్టి నితరపుస్తకములలోనికి సంగ్రహించి గాని, తుదల ప్రరాంకితముల దగిలించి గాని గ్రంథకర్తగారు జరిగించు చర్యలకు బాధ్యులుగావలెను.

మరియు నీగ్రంథమున మొదట గ్రంథకర్తగారి సంతకమును గమనించిగాని గ్రంథముల నమ్మువారివద్ద కొనవలదు.



## బాలభక్త విద్యార్థి సమాజం.

### రామనరం



హిర:—* ఎందుకు తర్కములాడెదు నాకీస్తంభమునందున జూపెదవా?

పుట 101 పంక్తి 15.

# పీఠిక



కావ్యరచనలం దగ్రగణ్యములనఁదగు యక్షగానకావ్యములు వృద్ధి యగుచున్న యీ కాలమున నేనును కొన్ని గ్రంథముల గానకవిత్వ రూపమున రచియించి పండితపామరలోకమున నోగో బాగో యని పించుకొనుచున్న వాఁడనగుట నా బుద్ధి మరల నదేమార్గంబునకుఁ మఱిగి పరమభాగవతోత్తముండగు ప్రహ్లాదుని చరిత్రమును నాటకరూపమున నాకుఁ దోచినటులఁ జిత్రించితిని. వ్రాయుటే తడవుగ నావద్ద సంగీత విద్య నభ్యసింపుచున్న (బాలవిద్యార్థిసమాజము) వా రిదివరకే నాచే రచింపఁబడిన కొన్ని నాటకముల పలుతావులఁ బ్రదర్శించి పెక్కం డ్రచే గౌరవమునుఁ బడసియున్నవారగుట నీ నాటకమునుగూడ నభ్య సించి యనేకతావులఁ గడు నిపుణతతో ప్రదర్శించి పెద్దల యానందము నకు నన్నుఁగూడ పాత్రునిఁగావించుటేగాక సంగీతసాహిత్యాభిలాషులు పలువురచే యీ యముద్రితగ్రంథమును సాధ్యమైనంతత్వరలో ముద్రణ మొనరించి లోకమున ప్రకటింపుడని నన్ను మిగుల ప్రేరేపింపఁజేసిరి. నేను సదా పెద్దలయాజ్ఞకు బద్ధుఁడనే గాన యీ గ్రంథము నాకస్మిక ముగా నాకు తగిన తీరికలేని సమయమునందే అచ్చొత్తింపవలసివచ్చినది. ఇందలి ఒప్పులను సంతసింపుచు తప్పులను నాపై దయతో జూపు శ్రమ చదువరులకే విడిచిపెట్టితిని.

ఇట్లు

మీ విధేయుఁడు

సహజకవి గ్రంథకర్త

రామవరము
13—8—29



# ఇందు వచ్చు వేషధారులు

## పురుషులు

హిరణ్యకశిపుడు—రాక్షసరాజు

శకుని
శంబరుడు
నముచి } హిరణ్యకశిపుని యనుచరులు

నారదుడు—దేవమౌని

దేవేంద్రుడు—స్వర్గలోకాధిపతి

బ్రహ్మ—సృష్టికర్త

జయంతుడు—దేవేంద్రుని కొడుకు

అలకూబరుడు—కుబేరనందనుడు

యముడు—నరకాధిపతి

ప్రహ్లాదుడు—కథానాయకుడు

షండుడు—బడిపంతులు

నరసింహమూర్తి—విష్ణుని యవతారములందొకటి

వసంతుడు
గాలవుడు
శంబరుడు } ప్రహ్లాదుని సహాధ్యాయులు

బంగారయ్య—పాములవాడు

## స్త్రీలు

లీలావతి—హిరణ్యకశిపుని భార్య

విద్యుత్ప్రోష్టి—లీలావతి చెలికత్తె

సరస్వతి—బ్రహ్మసతి

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః.

# భక్త ప్రహ్లాద



## దైవ ప్రార్థన

ఖరహరప్రియ — త్రిశ్రజాతి

దసనిపా-గమరిసా-నిసగమపస-నిదప-మగమ
రఘువరా-రఘువరా-యఘురహితా-సుగుణ-చరిత
పమగ-రిగరి-సరినిసా-నిసగ-సగమ-గమప-మపద॥ దస॥
నిగమ-వెవిద్య-గావుమా-అఅఅ-అఅఅ-అఅఅ-అఅఅ॥ ర॥
సగగగారి-సరిసనీస-సగగగారి-సరిసనీస
నిఖిలలోక-పూజనీయ-సకలభక్త-మోక్షదాయ
నిసగ-సగమ-గమప-మపద-దసని-మపగ-రిసనిసా
శుకశ-వునిక-నార-దాది-స్తోత్ర-కీర్తి-నీఇఇయా
నీసాగ-సాగామ-గామాపపా॥ దస॥
నీదయా-నీదయ-రాదా యెనే॥ రఘు॥
దురితలతా తతిలవిత్ర-దుఃఖాటవి-వీతిహోత్ర
వర సజ్జనచయపవిత్ర-తరమె పొగడ నీచరిత్ర
అఅఅ-అఅఅ-అఅఅ-అఅఅ॥ రఘు॥



## రంగము—హిరణ్యకశిపుని సభా భవనము



[హిరణ్యకశిపుడు శకుని శంబరాది యనుచరులమధ్య విచారముతో కనబడుచున్నాడు]

హిర:— తోడి — ఏకతాళగతి

నేడెంతవిపరీతమో! యేనాఁడు-నేబడని-యీ
గోడు-గలిగించె శౌరి॥ నేడెం॥
వీడుచుఁ ప్రాణముల్-గూడుదుఁ-సైదోడును॥ నేడెం॥
పాడుదేవుఁ డిటులఁ జేసి-పగనుఁ బెంచెనా!
తోడునీడవంటి తమ్ము-న్నోడబుచ్చెనా!
రాడంతటితమ్ముడింక-రాజ్యభోజ్యములనొల్లను
వీడుచుఁ-ప్రాణముల్-గూడుదుఁ-సైదోడును॥ నేడెం॥
కుటిలుఁడు యీ దొంగచక్రి-కిటియై యనుజుని వధించె
కటకట! కాలమిటున్నది-మటుమాయకు నెటులఁ గెల్తు
పటు రోషమునఁ-హరిపై-పగ నేమానఁ-ధరలోనఁ
గసిదీరఁ-బరిమార్తుఁ-బిరాన॥ నేడెం॥

(నిట్టూర్పు విడిచి) అమాత్యులారా! ఆ దొంగ శ్రీహరి పందియై నాతమ్ముని ప్రాణముల కేలఁ దాపురించెను? అకటా! నా కుడిభుజంబునుఁ దెగటార్చెఁగదా! ఏమి చేయుదును? ఈ దినమింత చెడ్డదేమి? ఇట్టి భయంకర వార్త వినిపించినదేమి? ఆ మహావిష్ణు నెటుల సాధించి

నాపగఁ దీర్చుకొందును? యూరకుంట బంటుదనమా? శివశివా! కొండంతతమ్ముని, సింహబలశాలినిఁ గోలుపోయిన నాకింకేటికీ బ్రతుకు? ఓ రాక్షస వీరులారా! ఇదియే నా ప్రతిన వినుఁడు.

తే॥ గీ॥ ఖండితంబుగ త్రిజగము । ల్గలచివైచి
హరిని సాధించుటో గాక । యాహవమున
నతనిచే నేనుఁ గూలుటో । యగుట నిజము
తప్పదిది యెప్పటికినైన । దనుజులార!

శకుని:—బలే! బలే! రక్కసవీరశిఖామణీ! ప్రతిన సల్పి నెరవేర్చుకొన నీకే చెల్లును. తమరు తలంచిన యా దొంగచక్రినిఁ గడతేర్చుట చిటికెలో నున్నది. తమ రెద్ది చెప్పినను చేయుటకు మేము సిద్ధముగా నున్నాము.

శంబ:—ఆ చక్రిగాడు మన రాక్షసవీరులనుఁ జూచి యెన్నఁడూ యోర్వలేఁడుగదా! పచ్చపచ్చగా నున్న మన లనుఁజూచిన కన్నులలో కారము బోసుకొనుచుండును. కానిండు. మనమింక వాని తమాస చూడక విడువరాదు. మన రాక్షసదెబ్బయన్న ఆ శ్రీహరికి శాశ్వతముగా జ్ఞాపక ముండులాగున జేయవలయును.

హిర:—ఓ మిత్రులారా! ప్రపంచమును భగ్నమే గానిండు. బ్రహ్మాండభాండముల బ్రద్దలేగానిండు. నా కఠోర ఖడ్గధారచేత మహావిష్ణుని వక్షంబువిదలించి గుండెలంగారు

వేడినెత్తురుచే నాసోదరునికి తర్పణంబుఁ గావించెద నిది నిజము. ముమ్మాటికి నిజము.

(అంతరిక్షమున నారదుఁడు)

నిజము. నిజము. దనుజకులేశా! నీవు తలంచిన పనిఁ జేయుటలో సాటిలేనివాడవు. పంకమూనుట యన్న యట్లుండవలెను.

హిర:—(ఆలకించి) ఓహో! సమయమునకు నారదుఁడుఁగూడ వచ్చుచున్నాఁడు. వీఁడు నా కేదియైన యుపాయమునుఁగూడ తెల్పఁగలఁడు.

శకు:—(తనలో) వీని యుపాయములు విన్న మన కపాయములు కావుగదా! వీఁడసలే గోవింద పక్షపాతి. అందులోనూ కొంపలుదీయు కొఱవియని లోకప్రఖ్యాతి.

శంబ:—(తనలో) తడిగుడ్డలతో గొంతులు గోయుటకు వీనియంత తంత్రగాఁడులేఁడు. వీఁడు మమ్ము మోసము చేయఁడుగదా!

హిర:—(సమీపించి నారదుని జూచి) నారదా! సమయమున కేతెంచితివి. రమ్ము కూరుచుండుము. నీవు గోవింద భక్తుడవైనను నా కతిమిత్రుఁడవు గాన చెప్పుచుంటిని. చూచితివా? నారాయణుఁడు వరాహరూపంబున మా హిరణ్యాక్షుని వధియించి యీ రాక్షసప్రభువునకు యెంతయెగ్గుసల్పెనో?

నారః—(మొగము చిట్లించుచు) ఆయన యెన్ని ట్టి తెలివితక్కువపనులే చేయుచుండునయ్యా! కాదన్న మా బోంట్లపై మండిపడుచుండును. అయ్యో! తమరిపుడు నిందువిచారమున మునిఁగియున్నారు. దైవఘటన కేమి చేయుదురు! బెంగఁబెట్టుకొనకుఁడు.

తే॥ గీ॥ చింతచే వ్యాధులొనఁగూడు । స్వేచ్ఛలణఁగు
బుద్ధినశియించు యోచనల్ । బుగ్గియగును
మీఁకు పగతుల సాధింప । లేరు జగతి
ఘోరనరకంబుగాదే? వి । చారబాధ

శకుః—అసురచక్రవర్తీ! వగపుడుగు. వగపుడుగు. కుక్క కాటుకు చెప్పుదెబ్బలాగున యీ గోవిందునకుఁ బ్రతిక్రియ యోచింపుఁడు.

శంబః—దేవా! దీనత్వము వలదు. రండు యీ శ్రీహరిగానిపైఁబడి గుండెకాయలనుఁ దీసుకుతిందము.

నారః—(తనలో) క్రూరాత్ములకు దుర్బోధలను మప్పి కృంగఁద్రొక్కించుటయేగదా! నా పని. ఈ సమయమున కావరమున కన్నులు గావకయున్న వీని కింకను పెక్కు దురాలోచనల మప్పెదనుగాక.

(ఆలోచించు చున్నాడు)

హిరః—(నిట్టూర్పువిడిచి) నారదా! ప్రాణమిత్రుఁడవు సమయమునకు చేరుకొంటివి. యోచనదెల్పుటకు

నీవంటి బుద్ధిశాలి మరియొకఁడు దొఱుకఁడు. కష్ట సాధిం చుటయందు నాకుఁగల పంకము నీకే తెలియును. ఎటుల శ్రీహరి నాకు దొఱకును. ఎటుల వానిని నే వధింపఁ గలను. ఎటుల నా కోపాగ్నిని చల్లార్చుకొనఁగలను.

నార:—దనుజేంద్రా! తొందరపడవలదు. ఇట్టి ఘన కార్యములం దాలోచించి పని చేయవలయును. శ్రీహరి యన్న సామాన్యుఁడుగాఁడు యాతనిని జయించుట మాట లతో గాదు.

బేహగ్—చతురశ్ర

హరినిఁ గెలువ సామాన్యమే-అ
సురేశా! మది నెంచుకదలపుము॥ హరి॥

చరాచరుల కంతరాత్ముఁడగు యా
పరాత్పరుఁడు శ్రీ ధరాకళత్రుఁడు

* త్వరనుం-గెలువం-దరమే-యొకులకు
సురాసురులకు-నజేయుండగు యుల॥ హరి॥

పట్టుబడడు బ్రహ్మాదులకును కను
కట్టుఁగట్టి యాయ మేటిజగముల

* వట్టిమాటగాదుజుమ్మ-గట్టి గారడీఁడువాఁడు
దిట్టముగా మోహింపునటు-పుట్టిమునుగు లేకుండు॥ హరి॥

---

* ఈ గుర్తుగల చోట్ల పైకాలము నందుకొనవలయును.

విశ్వమయుఁడు శాశ్వితసంకల్పుఁడు
వెర్రివాఁడ! సర్వము తనలోనిది
* బస్విరెడ్డికవిపాలుఁడు యరిదూరుఁడు
పార్వతీశునకు చేదోడు వాదోడు॥ హరి॥

హిర:—నిజము నిజము. లేకున్న యేపాటివాడు నా సోదరుని కన్నుల దుమ్ముఁగొట్టి గెల్వఁగలఁడు. అందు లకే తగిన యోచనఁ దెల్పుఁడు.

నార:—అటులైన "కాలుగాలిన పిల్లికరణి"గంతులు వేయక విను. చక్కనిమార్గమునుఁ దెల్పెదను.

తే॥ గీ॥ సాధుమతివై చలంబును । జంపి తొలుత
తపసివై వనికేగి వి । ధాతవలన
వరములంగొని తరువాత । హరిని వెదకు
సర్వముజయింప శాంతమే । సాధనంబు॥

శకు:—ఈ యుపాయము బలేగానున్నదయ్యా! ముందు వరములగొన్నపిమ్మటమనయిష్టమువచ్చినట్లు చెలరేగవచ్చును.

హిర:—అటులైన నారదా! నేను నేడే తపసినై యడవులకేగి విధాతను ప్రసన్నునొనరించి మిగుల కట్టుదిట్ట ములగు వరంబుల గోరుకొని యా వైకుంఠుని సాధించెదను.

నార:—నీ వేమివరములఁ గోరనున్నావో ముందు నాతో కొంచెము దెల్పుము. అం దింకను కొఱంతలున్న పూర్తి జేసెదను.

హిర:—అటులైన తెల్పెదను. నీ మనంబున నే యుంచుకొనుము. పగలుగాని, రాత్రిగాని, భూమింగాని, యాకసంబునగాని, సురాసుర గరుడ యక్ష గంధర్వ కిన్నర కింపురుష సిద్ధచారణ మానవాదులంచే గాని, పరశు పట్టస శూల చక్రగదా ఖడ్గశరాది యాయుధంబులచేంగాని చావు లేని వరంబులం గోరుకొనవలయునని యున్నది.

నార:—భళీ భళీ! యోచనకు తక్కువవాడవా? దితినందనా! నీకు తప్పక జయముగల్గును. దయయుంచుము. నేను సంచారమున కరిగెదను. (కొంచెము ముందుకుజని) తనలో ఈతడిట్టి వరంబులనే గోరుకొన్న ముల్లోకముల నుగ్రూతల్బాగింపకమానడు. ఆ దెబ్బతో లోకవాసులు గోవిందుని పదములపైంబడి మొరబెట్టుకొందురు. అంత నారాయణుం డీతనిదుంపం ద్రెంపంగలండు. అంతతోగాని మాబోంట్లపీడ నిశ్శేషముగా వదలిపోదు. కానిమ్ము. కథా క్రమ మెట్లునడచునో చూచెదనుగాక! ఈ సందర్భమున నాకింతకూడు దొరుకదా! (పోవుచున్నాడు)

హిర:—శంబరా! నేడే నేను మందరాద్రికి తపం బొనరింపజనెదను. మీరు రాజ్యకార్యములను నేను వచ్చు వరకుం జక్కబెట్టుచుండుడు.

(అందరు నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము

[అంతఃపురమున లీలావతి, విద్యుమ్మోష్టి కనబడుచున్నారు]

లీలా:—(విచారముతో)

జంఝూటి—మిశ్రజాతి

నాథుడింక రాడాయెనే-తపమునకుఁజనిన॥ నాథు॥
బోధపడదు-నామనమున-కేదియు ధై-ర్యము నా ప్రియ॥ నా॥
తపము సల్పి-వరములగొని-రిపులను సా-ధింపఁదలఁచె
కృపగల్గునె-దైవమునకు-క్రూరతలఁపులివియుఁగావె॥ నా॥
తమ్ముని బ్రోవ-మార్చెనంచు-తరుణీ! నా-రమణుడు దై
వమ్ముపైని-పగఁగొనిచనె-నమ్మా! తాళదు మనమ్ము॥ నా॥
అసురవితతి-యుసురులఁగొను-బసివిరెడ్డి కవివరదుఁడు
కుసుమగంధి! యెటులైననుఁ గూల్పఁజాలడే-తా-దూర
మెంచడే-కటకట-యుసురుమనెడు-నా ప్రాణము-లసురే
శుఁడు వచ్చుదనుక॥ నాథు॥

అమ్మా! విద్యుమ్మోష్టి! ఎందైన నేలవిడిచి సాము జేయువారుగలరే? తనకేమో నారదుడు బోధించెనని హరిని సాధింప తపమునకు వనముల కరిగెను. ఏమిచేయను! ఎంత బ్రతిమాలినను వినకపోయెనుగదా! నాకు ప్రసవదినములు సమీపించుచున్నవి. ఒంటిగా యింట చరించుటకు నాకెంతయో భయమగుచున్నది. ఆయనగారు లోకమున

కంతకు పగయేగదా! ఒకరితోడనైనను యిష్టముగలదా? పతియింటలేనివేళఁ గనిపెట్టి యెవ్వడేసమయమునకు వచ్చి నన్నేమిచేయునో యని వెరపగుచున్నదమ్మా! అదియును గాక నారాయణభక్తుండగు నారదుఁడు నారాయణుని సాధించుట కుపాయములుదెల్పునా? ఈయన కీ వైరినమ్మకము లేమిటమ్మా!

శా॥ నారీ! తమ్ముని భంగపాటు వినియున్ । న్నాథుండు తాఁగూడ నా
ంకేద్రొక్కుచునుండెఁగొంకకను ని । ర్దాక్షిణ్యుడై చక్రి యే
తీరోవ్యాహముఁబన్ని తా ప్రతినమున్ । దీర్పంగ లేడే? ధరా
ధారుండా సిరినాధుతో పగలఁటే । తన్వీశుభంబౌనఁటే?

విద్యు:—అయ్యో! కలహాశనుఁడా? ఆ నారదుని మాటలు కలహాకారణములు గావటమ్మా! ఐనను భయము లేదులే! నిశితప్రతాపపరిపూర్ణుఁడగు నీపతి నెవ్వ రేమియు చేయఁజాలరు. నేడో రేపో చల్లగ యిల్లుచేరఁగలరు.

[మందిరద్వారమువద్దకు దేవేంద్రుఁడు ప్రవేశించుచున్నాడు]

దేవేం:—(తనలో) తరతరములనుండియు యీ దుష్ట రాక్షసులు మా దేవతలపాలికి మేకులై మమ్ము సుఖముగా బ్రతుకనీయకున్నారుగదా! నాకు స్వర్గాధిపత్య మున్నదన్న మాటయేగాని నాయధికారమునకు క్షణక్షణ గండములే

గదా! మున్నటివరకు హిరణ్యాక్షుఁడు పీడించి పీడించి విడువ అంతటితోనైన విడువక మాదుంపద్రెంపుటకు మరల యీ రాక్షసరాజు తపమునకు బయలుదేరినాడు. వీడు కొన్నాళ్ళు మా యెముకలు కొరుకకమానడు. ఛీ! ఛీ! ఇంతకన్న స్వర్గలోకసామ్రాజ్యమున కొక సాష్టాంగ నమస్కార మర్పించి భార్యాబిడ్డలతో వనములకేగి తపము జేసుకొనుచు కాలముఁగడుపుట యుత్తమము. (ఆలోచించి) ఏమైనంగానిమ్ము. మాకింకను పడవలసినపాట్లు కొంతకాల మున్నను ముందుమేలునకు జాగరూకుఁడనై యుండుట మంచిది. ఏతలంపున యిచటికేతెంచితినో యాపని చేయుటకు సందియింపనేల? (లీలావతినిఁ జూచి)

కమాచి—ఏకతాళము

మంచిసమయ మిదియే-యీ
మానిని చెరఁగొని బిరబిర జరుగగ॥ మం॥
చంచలాక్షి పతిలేక యొంటిగా
పంచనున్న దీపడఁతినిఁ గొనిచన॥ మం॥
మి॥ సందియింపకర్ - చెరయందువైచెదర్ - దీనిఁ
గుందజేసెదర్ - ముదమొందఁజూచెదర్ - క[illegible] మం॥
పుట్టబోవు యీసతి కడుపునఁగల
గట్టిపిండమును నా పగదీరగ
మి॥ పట్టి చీరెదర్ - నేలఁబెట్టి ప్రామెదర్ - వెరపు
నెట్టివైచెదర్ - స్వర్గమట్టె యేలుదుర్ - స్వేచ్ఛ॥ మం॥

(మెల్లగ నడుగులువైచుచు) ఆకస్మికముగా దొంగ చాటున పైబడి యెత్తుకపోదునా? లేక మాటలాడక యొక్క వ్రేటునకు తెగనరుకుదునా? (కత్తిదూసి) కటకటా! ఈ ఘోరకృత్యంబులు యుక్తాయుక్త విచారశూన్యులగు రాక్షసకూళలకు చెల్లునుగాని ధర్మాధర్మముల నాలోచించు మాబోఁటిట్లకా? కరములాడకున్నవి. నేను వచ్చినదే దొంగపనికి. ఎవ్వరైనవిన్న నవ్వరా? నాకీ నీచభావ మేల జనించినది? ఛీ! ఛీ! మంచిదనమున కాలోచించువాడ నగుటచేతనే సంకటములపాలుగావలసి వచ్చుచున్నది. ఏమైననుసరే! ముందుసుఖమునకు దీని గర్భమునందలి పిండమును నాశనము చేయక తప్పదు. నాకు దొంగపనియేల? చెప్పియే చేయుదును. నన్నెవ్వరును చూచుచుండుటలేదు గదా! (ఇటునటుఁ జూచుచున్నాడు)

విద్యు:—అమ్మా! ఆవల చప్పుడగుచున్నది. ఆయనగారు వచ్చుచున్నారేమో! చూచివచ్చెదనుండు. (రెండడుగులు ముందుకువైచి దేవేంద్రునిఁజూచి గుండెలు బాదుకొనుచు వెనుకకుపరుగెత్తి వచ్చి) అమ్మయ్యో!. ఇపుడేమి గతి. ఇపుడెందుదాగుదను? అయ్యో! హృదయము కంపించిపోవుచున్నదమ్మా! (వణకుచున్నది)

లీలా:—ఏమమ్మా! పరులెవ్వరైన నేతెంచిరా?

విద్యు:—ఎవడో నవవయస్కుడే! సుకుమార పురుషుడమ్మా!

(అంత దేవేంద్రుఁడు సమీపించును)

లీలా:—(తల వంచుకొని) ఇదియేమి? అయ్యా! మీరెవరు? శుద్ధాంతముగ్ధాంగనలుండు తావునకు రా సాహసించితి రేల?

దేవేం:—(తనలో) ఇపుడీమె కేమని ప్రత్యుత్తర మీయవలయునో నాకుతోచకున్నది. (నేలజూచుచున్నాడు)

లీలా:—అయ్యా! పలుక రేమి?

సింధుకమాచి—త్రిశ్రజాతి

సందియింపకీ-సుందరులున్న
మందిరములకు-రాతగునా?॥ సంది॥
అంధుఁడవా? మతిమందుడవా? కా
మాంధుఁడవా? చాలు పెందలకడెఁబొమ్ము॥ సం॥

దేవేం:--చాలు చాలు గజగమనా!

పదిచదువకు పనిగొనివచ్చితి॥ చాలు॥
చాలా-దనుజ-బాలా! మృదుక
పోలా! వచ్చితి-వేళా-పనిగల్గి॥ చాలు॥

లీలా:—పదపదే పతిలేడింటఁ-ప్డనియేమున్నది యిటఁ

దేవేం:--మదవతీ నీయుదరముఁగోతు

లీలా:—ఇదియేమిచేత?

దేవేం:--అదియే నాకిందులపని

లీలా:—ఇదియేమిర దోసకారి

దేవేం:--బెదబెదవాగకు ద్రుంచెద (కత్తిజూపును)
లీలా:—అధముడా! కుదురుగా-పదపదనీ-సదనమునకు॥సం॥

దేవేం:—ఓవనితా! నన్నెవ్వఁడని తలంచి తూలనాడుచుంటివి?

తే॥ గీ॥ అమర సామ్రాజ్యవిభవము । లనుభవింప
నదితి గర్భనాగరమునం । దవతరించి
దేవఋషుల మన్ననల క । ధీనుఁడ నగు
దేవతాధిపునిగ నన్నుఁ దె । లుసుకొనుము॥

విద్యు:—అయ్యా! దేవతాధీపుడనని చెప్పుకొన సాహసింపకుడు. తప్పుతప్పు యెవ్వరైనవిన్న నవ్వుదురు. స్వర్గాధిపతియేమిటి? ఈచేతలేమిటి? పాపవిదూరులటగాదా? తమరు.

దేవేం:—ఐననేమి? నా మేలునకు నేను యోచించితిని. ఎవరిసుఖముల కెవరు ప్రయత్నింపరు?

విద్యు:—చాలు చాలు. ఈ తల్లిని వధించుట మీకు మేలుకొరకా? ఈ యబల మీకేమిపగ చేసినది.

దేవేం:—కావలసినంత చేయును. మమ్ము నులుముకుతినుట కొక దుష్టపుత్రునిఁగనును. మే మనుదిన మీ రాక్షసతులువలతో వేగలేక కృశించిపోవుచున్నామే! మాపాట్లు మీ కేమి తెలియును అందుల కీపె గర్భస్థుండగు శిశువును వధియించిన మాకు ముందు రానున్న సంకటములు కొన్ని తగ్గునుగదా!

విద్యు:—దేవేంద్రా! ఈపెగర్భంబున జన్మించువాడు నీకు హానిచేయునని యిపు డీపెను ద్రుంపసాహసింతువా? అతఁడు సన్మార్గచతుఁడగునేమో యనుకొనరాదా? అంద ఱొకేవిధముగా నుందురా?

దేవేం:—పులిపిల్లకు పిల్లిపిల్ల బుట్టునా? దుష్టునకు దుష్టుఁడుగాక సన్మార్గుఁడు జనించుకేఁడ? వేయేల? పాపమే గానిమ్ము. దూషణమే రానిమ్ము. నేనిపుడు అమరహితార్థంబుగా యీపెనుఁ ద్రుంపక విడువను. నా కింతకన్న తరిరాదు.

లీలా:—ఓరి వెఱ్ఱివాడా! పాపాత్ముఁడా! నీ తెలివి యేమూలఁ గూలినదిరా? నీ దేవత్వ మెచట కాలిపోయి నదిరా? నీ ప్రభుత్వ మేడ బుగ్గియైనదిరా? ఇంతులఁ జంప బయలుదేరితివటరా ద్రోహీ!

ఉ॥ ఇంతులనేచు పాపమది । యింతటనంతట నేలబోవునో
హంతక! బిడ్డలఁ గనవో? । యాలియు లేదో? దివంబు నేలవో?
గౌతముశాపతప్తుఁడవు । గావో మురాత్ముఁడ రాకురాకునా
చెంతకు చింతలొందెదవు । చెచ్చెఱ వచ్చినత్రోవ నేగుమా!

దేవేం:—అంగనా! నేనొనరించునది దారుణక్రూర కృత్యమని నాకు తెలియకపోదు. మీవారిచే ననయము బడు యలజండ్లమిగుల ప్రవేగియున్నవాడనగుటచే ప్రాణము

విసిగి పాపమైననుసరే! రౌరవమైననుసరే! అని యీపనికి సిద్ధమైతిని.

తే॥ గీ॥ దేవనాథత్వమే యూడి । పోవనిమ్ము
ప్రకటకలుషము నెత్తిఁ జు । ట్టుకొననిమ్ము
ప్రజలదూషణల్ నామీఁదఁ । బడగనిమ్ము
గాని నాకృత్యమును మాన । కలికిమిన్న!

అయ్యో! హంతకుడా! నీకీదుర్బుద్ధి మప్పినవారెవ్వరు? నీగురుండగు బృహస్పతియైన నీయత్నమును విని నిన్ను మందలింపడా? శచీదేవియైనను నీకిది తగదనదా? నానాథుడు లేనివేళఁ జూచి యబలనగు నన్నెత్తుకపోదలఁచుట పదుగురిలో తలనెత్తుకొనుచున్న నీకెంత సిగ్గుబాటు? మూర్ఖుఁడా! నీకిది యేమిబంటుదనము? దివిజాధిపతికిఁ దగిన చేతలా యివి? బుద్ధిఁదెచ్చుకొని మరలిపొమ్ము.

దేవేం:-- బేహాగ్—త్రిశ్రజాతి

జాలమేలనోపడతీ! మానక్ నాపని నిజముగ॥ జా॥
ఏలా! యికదాపరికము-వాలునఁద్రుంపక మానక్॥ జా॥

లీలా:—తొలఁగు తొలఁగు దుర్మతీ-చి ఛీ-దుండగములు మేరమీరె॥ తొల॥
ఖలమతీ! యింతచలమా? అబలలపై నిధి-బంటు దనమా॥ తొల॥

దేవేం:--త్రిదివముపాలించువాని-బెదరులేక దూరెదవా?

లీలా:—త్రిదశులెన్నఁడైన యిట్టి చెనటిపనులఁ జేయుదురా?
దేవేం:--మదవతి యేమైనఁగాని-నినుఁగొని చెరనిడకమాన
లీలా:—విదితబలుఁడు నామగండు-విడుచు నెనిఁ బ్రాణములో
దేవేం:--చాలుచాలు నింత కావరమా
లీలా:—చానల నేచుట పౌరుషమా
దేవేం:--చూడు మేమి చేతునో-సునిశితకరవాలమునఁ

ధరఁబడ వ్రేతు బిరానఁ-కరాలు॥ జాల॥

(ఖడ్గముతో నరుకఁబోవుచున్నాఁడు)

విద్యు:—అయ్యయ్యో! పాపాత్ముఁడా! ఇదియేమి క్రూరమురా? ఇదియేమి ఘోరమురా? అమ్మయ్యో! భయమగుచున్నది. ఒడలు కంపించిపోవుచున్నది. నే నీదారుణము చూడఁజాలను. (పాఱిపోవుచున్నది)

దేవేం:—అయ్యో! కత్తి విసరుటకు చేయాడకున్నది. ఛీ! నాదింత జాలిబ్రతుకగుటచేత నే నాపని యింత మెత్తన. ఈమె మూర్ఛబోయినది. ఇంక నరుకఁజాలను. ఆలసించితినా? ఎవ్వరైనఁజూచినచో మోసమువాటిల్లును. ఇంతపని చేసి విడిచినను లాభము లేదు. ఎటులైనను యీ సంగతి దీనిమగనికి దెలియకమానదు. ఏమైనను గానిమ్ము. ప్రస్తుతమీపె నావలి కెత్తుకొనిపోవలసియున్నది.

(అటుల చేయుచున్నాఁడు)

## తృతీయ రంగము



[నారదుని యాశ్రమ ప్రాంతమున లీలావతి నెత్తుకొని దేవేంద్రుఁ డరుగుచున్నాడు]

నార:—(చూచి) ఎవడు చెపుమా! వీఁడు యొక యబల నెత్తుకొనిపోవుచున్నాడు. ఎవ్వఁడేని రాక్షసుఁడా? కాదు. కాదు. సునాశీరివలెఁ దోచుచున్నాఁడేమిటి? ఈతఁడునూ రాక్షసులవలె యీ పాపకృత్యములలో దిగినాఁడేమి చెపుమా! (దరిఁ కేగి ఆశ్చర్యముతో) ఇదియేమయ్యా! దేవేంద్రా! నీకు మతిపోయినదా యేమి? ఈరాక్షసకృత్యము లెన్నడు నేర్చుకుంటివి? ఆగుమాగు మెవ్వరీమె?

దేవేం:—(లీలావతి నచటడించి) పాపాత్ములకు ప్రాపగుచున్న యీరోజులలో పాపములకు సిద్ధపడినఁగాని పనులు జరుగవయ్యా!

తే॥ గీ॥ ప్రాణమంతయు విసిగి యీ । పనికి నేను
లజ్జఁబోనాడి సిద్ధమై । నాడ వినుము
యీమె దనుజేంద్రుసతి నన్ను । యొంద రేమి
యన్న విడనాడ నింక నీ । యబ్జముఖిని॥

నార:—(వింతతో) సరి సరి. ఇది యేమిచాద ష్టము. ఇట్టిసాహసమున కెట్లొప్పుకుంటివి? ఎవ్వరైనవిన్న నవ్వరా?

జంఝూటి—ఏకతాళము

తగునా? నీకిసురపాలా-తరుణులనీగతి-చెరఁగొనిపోవుట॥త॥

తగుబాటిదిగాదా! మీబోంట్లకు

తగవుతగవుయివి దనుజులచేతలు॥ తగు॥

ప్రముచ్ఛిలించి యిటుగొనిరాగ-యీకుచ్ఛకంటి యేమి

జేసెపాపము స్వచ్ఛమైన నీకీర్తినశింపదె * చాలుచాలు

వీగువీగు పాడుబుద్ధి మానుమింక॥ తగు॥

దనుజేశుడువిన్న-నీపయి-దారుణపగ బూనడ? పోరా

డడ? చనుము చనుము యీగరితను విడువుము-సాధ్వుల

నవయింపకు కడుపాపము, *దనుజుల పనులివి-తమ కెటు

చెల్లునయ్య-కరుణనుఁగొనుమయ్య-కమపతివ్రతయిది!త॥

అదియునుగాక,

తే॥ గీ॥ గౌతమునిసతికోరకేగి । ఖ్యాతిదరుగ

మునుపుదెచ్చిన తప్పాక । మూలనుండ

మరల యిదియేమియేచ్చు నీ । మతిచలించె

నే? సురాధిప! చాలు నీ । నీతపుఁబని॥

తప్పుతప్పు మెచ్చఁబడరు.

దేవేం:—నారదా! నేను మరియొక యుద్దేశముతో

యీపెను ప్రముచ్ఛిలింపలేదు. నా మేలునకై యీపెను

చంపఁదలంచి, చేతులాడక చెరశాలనుఁ బడవేయఁగొని

పోవుచుంటిని.

నార:—వీనింజంపిన నీకేమి మేలుగల్గును.

దేవేం:—మందైవము యీపెకుఁబుట్టు బిడ్డలవలన మాకు భిన్నములుండవుగదా!

నార:—వెఱ్ఱివాడా! నీవుకూడ యింత యజ్ఞానివైతి వేమయ్యా! ముందు భిన్నములమాట దేవుఁడెరుంగును గాని, ఈపెను యిపు డెత్తుకొనిపోయినచో ప్రస్తుతము హిరణ్యకశిపుడు నిన్ను విడచునా?

దేవేం:—అప్పటి కేదేవునిమరుగుననో దాగెదను.

నార:—సరిసరి. ఇంతే పిరికివాడవు. ఈ సాహస మెటుల చేయగల్గితివి? ప్రాణములన్నియు నరచేతఁబట్టుకొని చేసితివి కాబోలును. నీ కొక చిన్న రహస్యమునుఁ దెల్పెద నాలకింపుము. నీ విపు డింత శ్రమపడనక్కఱ లేదు. ఈపె కడుపున ప్రహ్లాదుండను పరమ భాగవతోత్తముం డొకఁడు జనింపగలడు. ఆ యర్భకునిపై వైరమూని దాకు సేంద్రుండు హరిచే మడియఁగలఁడు. సందియము లేదు. నేను దివ్య దృష్టినిఁ దెలుసుకొంటిని. ఈపెను యెప్పటియట్ల యంతః పురంబున మెల్లఁగ విడిచిపెట్టిరమ్ము. దనుజేంద్రుఁడుకూడ వచ్చుకాలము దాపైనది. అతఁడు బ్రహ్మచే మేటివరంబులఁ బడసి, ఆకొన్న పులిపిల్లవలె రాగలఁడు.

దేవేం:—(భయముతో) నారదా! ఇప్పటికే సగము జచ్చియుంటిని. నే నీపెను మరల యచట విడిచి రాలేను.

యిచటనే విడిచి నాలోకమున కరిగెదను. యీపె మూర్ఛ తేరినతరువాత నెటులనో యీమెను నిజగృహమున కంపి వేయుము. ఈ రహస్యము మాత్ర మెవరికు తెలియ నీయకుండఁగా పాడవలయును.

నార:—(నవ్వుచు) సరిసరి! ఉపాయము చెప్పవచ్చి నందుకు నా కిది యొక లంకెయా? త్రిజగాధిపతివి నీకే యింత పిరికియుండ బక్కజోగులకు మా కెంతభయముండ వలయును. నీవే పని చేసినట్లు నే నొకవేళ దాచినను, లీలావతియైన తన పతితోఁ జెల్పదా? అప్పుడైన వాఁడు నీ జాతరఁ జేయ సిద్ధపడఁడా?

దేవేం:—(నారదుని చేతులు బట్టుకొని) నారదా! ఎటులనో సర్దుబాటు చేయఁగల బుద్ధిశాలివి. నీవుకూడ యిటు లనియెద వేలనయ్యా?

నార:—నేనుమాత్ర మీ తంటాను యెటుల సమ ర్థింపగలనయ్యా!

దేవేం:—ఉపాయపరుడవు. నీవే సమర్థింపవలెను గాని, నేనేమి చెప్పను.

సీ॥ నేనిట్టిపనిఁ జేసి । వానని సుంతయుఁ
 పరులవీనులయందుఁ । జొరఁగనీకు
మమురారి తెలిసి ని । న్నడుగవచ్చినయెడఁ
 నాకు తెలియదటంచు । బూకరింపు

మది వీలుపడకున్న । యబలకుఁ బతితోడ
చెప్పవద్దనినైన । యొప్పఁజెప్పి
మఱియు బోసంగమి । నమరుఁ డెవ్వఁడో గాని
దేవేంద్రుఁడీపనిం । జేయఁడనుము
తే॥ గీ॥ యుక్తియూహాలంబన్ని యో । శక్తికొలది
నచ్చఁజెప్పితి యెటులైన । మచ్చకంటి
నన్ను మరువంగ జేయుము । నారహాస్య
మెచ్చటన్ వెల్లడింపకు । వచ్చెబుద్ధి!

(నారదుని బ్రతిమాలుచు) ఈమర్యాదనుఁ గాపాడుము. నేనెన్నఁడింక యీలాటి చెడుతలంపులకు బోను. ఈమేలు మఱువను. సర్వము నీలోనున్నది. నేనింక బోయెదను.

(ఇటునటు బెదరుచూపులఁ జూచుచు పోవుచున్నాడు)

నార:—(తనలో) ఈపిరికిపంద నన్ను బొంకులాడుమని పారిపోయినాడు. కానిమ్ము. పాపము భయమున పిల్లియై పోయినాడు. సాధ్యమైనంతవరకు దాచ ప్రయత్నించెదను.

లీలా:—(మూర్ఛదేరి) అయ్యో! దేవనాథా! నన్ను విడువుము. విడువుము. నా నాథునకిది తెలిసిన నిన్ను బ్రతికిపోనీడు. ఈపాపమున కొడిగట్టకుము.

నార:—అమ్మా! భయపడకుము. నేను దేవనాథుడనుఁగాను నారదుడను. దేవేంద్రుడు నిన్నెత్తుకొనిపోవు

చుండ నిన్ను విడిపించితిని. ఇది నా యాశ్రమభూమి. భయము లేదు లే. ఇంక దేవేంద్రుఁడు రాఁడు.

[దూరమునుండి కేకలు వైచుచు హిరణ్యకశిపుఁడు శకుని శంబరాదులతో ప్రవేశించుచున్నాడు]

హిర:—(కోపముతో) ఎవఁడురా! దేవేంద్రుఁడని వాగుచున్నది. ఏడీ? యాదొంగ యెచటనున్నాడు. యేదె సకు పారిపోవుచున్నాడు. పోనీకు పోనీకు వచ్చుచున్నాను.

కదనకుతూహలం—త్రిశజాతి

కండలుగోతున్-తులువను-కాకుల కెర వేతున్॥ కండ॥
మొండివాని పేరువిన్న-మండిపడుచునుండెమనసు॥ కండ॥
ఏడీ? యా పిరికిపంద-యేడీ? నారీతస్కరుఁ
డేడీ? కనుపించడేమి? మూడెనూ కాలము వానికి॥ కం॥
మొత్తుదునా? దివిజులఁ బరుగెత్తించుదునా? మునులను
పుస్తెలఁ ద్రెంపించి-దేవ-పడతుల పసలనుఁగనియెద॥ కం॥
అసురవహ్ని దివిజాటవి-నాహుతిఁ గొనరేగినదిక
బసివి రెడ్డి దాసావను-బడాయిఁజూడకవినువ॥ కండ॥

లీలా:—(చటాలున పతినిఁ గౌగలించుకొని) హా! జీవితేశ్వరా! నన్ను రక్షింపుము రక్షింపుము.

• ఆనంద భైరవి—చతురస్ర

ప్రాణనాథ! బ్రోవవే-బిరాన-నా ప్రాణ॥
ప్రాణమదరి-గుండె చెదరి-కూడ దేమి సేతురా
మనోహరా! బిరాన-నా॥ ప్రాణ॥

బెబ్బులివలె యింటఁజొచ్చి-నిర్భయముగ దివిజ రేఁడు
బొబ్బలిడిన వినువకనర్-గొబ్బున నెత్తుకవచ్చెరా!

హిర:- వెరువకు నాయంతవాని-వెలదికితగునేభయంబు
తరుణి! నేడె రిపుని దెచ్చి-దాసత్వముఁ జేయించెద
వెరపువీడుమా?

లీలా:- హృదయేశా! వలదంతటి దురితము మన కేలరా!
మానరా॥ ప్రాణ॥

నార:—(తనలో) ఈ దొంగగాడెదకొడుకు సమయమున కందుకున్నాఁడేమి? వ్యాపారము చుట్టుఁదిరిగివచ్చినది. ఇంక నా దాటు నేను దాటవలయును. చేసినవాడింద్రుఁడుండ, నడుమ నాకెందుకీ కొండంతపిడుగు—సర్దుబాటు చేయువాటము దప్పినది.

హిర:—నారదా! పాకశాసనుఁడేడీ? యెచ్చట దాచితివి? పలుకవేమి?

నార:—ఓహో! ఇది యేమిటయ్యా! విడిపించవచ్చినందుకు నడుమ నాకొకటియా? ఇది.

శకు:—భయములేదులే నిజముఁ జెప్పు. నిన్ను విడిచిపెట్టెదము.

శంబ:—నీళ్లునమలుచు చెప్పితివేని యిదుగో! దుడ్డుగఱ్ఱ నీ నడుము కీళ్లూడబొడిచెదను.

నార:—సరెసరి. ఇవి యేటిమాటలు. నేను దొంగ వాడననుకొంటిరా! ద్రోహుఁడనుకొంటిరా? మంచి చెడ్డలెరుఁగక నోటికివచ్చినట్లెల్ల వదరెదరేమి?

హిర:—నీవు దివిజపక్షపాతివను సందియమున నా కింకరులట్లు తొందరపడిరి. అంతియేగాని, నిన్ను నేనెరుఁగనా? యేడీ! యా వేయికన్నులవాఁడు.

నార:—అయ్యా! ఆ దేవేంద్రుఁడు రాక్షసశత్రుత్వంబులకు ప్రాణమువిసిగి మతిచెడి యీయామె నెత్తుకవచ్చినాఁడేగాని మరియొక దురుద్దేశముతో దేలేదు. ఆ సంగతి యీయామెకుకూడా తెలిసియేయుండవచ్చును. నేనునూ వానిని తగినట్లు చివ్వాట్లతో సాగనంపితిని. చేసినపనికి సిగ్గుఁదెచ్చుకొని చచ్చి సగమై తన త్రోవనుఁ బోయినాఁడు పోనిండు. ఆ తెలివితక్కువవాజెమ్మను.

శకు:—చూచితిరా? ఆ పక్షపాతపుసర్దుబాటు. ఇట్టి ద్రోహకార్యముసల్పిన యా తుచ్ఛుని పోనిండని యెట్లుజెప్పుచున్నాఁడో!

నార:—ఓహో! మీరు నావెంట బట్టినారేమయ్యా! నా కెందుకు పోనీ! యా దేవేంద్రునిపైఁబడి కోసుకతినుఁడు. ఎవఁడుబోయిననాకేమి? వృధా పోరాటములు పెంచడ మెందుకని నేను నిజము చెప్పుచుంటిని. లేనిపోనివి కల్పించిచెప్పుట నా చేతఁగాదు.

హిర:—ఋషీంద్రా!

తే॥ గీ॥ అలఘుశక్తిని యతని వె । న్నాడిగదసి
చలముదీరంగ సాధించి । సరగఁదెత్తు
నంతవరకు నీ యబలను । యాశ్రమమున
నుంచుడీ! శ్రమయని మది । నెంచుకొనక.

కింకరులారా! రండు రండు. జాలముచేయరాదు.

(పోవుచున్నారు)

నార:—(తనలో) అమ్మయ్యా! శనిగాళ్ళు పోయినారు. బ్రతికితిని. మరల వచ్చులోపున యీమె గర్భమున గల పిండమునకు నారాయణమంత్ర ముపదేశించెదనుగాక! (లీలావతిని౯ జూచి) అమ్మా! నీకింక భయము లేదు. మిగుల బడలియుంటివి. నీ నాథుడు వచ్చువరకు నా యాశ్రమంబున నా గానము నాలకింపుచు సుఖముగా విశ్రమించుము.

లీలా:—అయ్యా! లోకమున నారద గానమని ప్రసిద్ధియేగాని తమరు బాడుచుండ యెన్నఁడువిననైతిని. నేటి కాలమునకు నాకుసంప్రాప్తమైనది. గానము నాలాపింపుఁడు.

నార:—(వీణమీటుచు)

శంకరాభరణము—ఏకతాళము

జయజయ త్రిభువన-స్థితిలయ కారణ-శార్ఙ్గరథాంగగదాసి
ధరా॥ జయ॥

జయజయ దారుణ కలుషనివారణ-సకలరోగ పరితాప
హారా

జయజయ మాధవ-జయజయ భూధవ
జయజయ ఖలగర్వాపహారా॥ జయ॥
లోకనాథ పరిపాల చరాచర
ప్రాకట దీనమందారా!
ఊకొని భక్తుని మొర మరి మరి విని
చేకొని యభయంబీవేరా॥ జయ॥
చంద్రసూర్యనయన! విశ్వమయ బస
వేంద్రదాస కవి పరిపాలా!
యింద్రాదిశాసనా! ఖలశోషణ
మొదుకుమోచన రావేలా?॥ జయ॥

(నృత్యముఁ జేయుచున్నారు)

లీలా:—హాయి హాయి! తమ గానామృతస్వాదనం బున నాదేహము పరవశ మగుచున్నది. నామనం శానం దాబ్ధి నోలలాడుచున్నది. మానివర్యా! తత్వార్థములఁ గ్రహించుటయందు నాకు మిగుల నాసక్తి. ఒకతత్వమునుఁ గూడ సెలవిండు.

నార— నాదనామక్రియ—చతురస్ర

ఆహా! తత్వార్థమెంతో-యమృతసారము
నీలోనే నిజమెరింగి గనుము నిందుమోదము॥ ఆహా॥

తొమ్మిది చిల్లులకుండన్నా -యిది-తోలునంబొదిగినకుండన్నా!
కుండలోనబ్రహ్మాండమంతా! నిండియున్నదటగనుమన్నా!
నిండుపట్టుదలతో దలపోసిన-నీకే బోధగు నోరన్నా
యిది దారన్నా! గనలేరన్నా! పామరులైన్నా॥ ఆహా॥

లీలా:—ఆహా! దీని కెంత యంతరార్థమున్నదో! వేదాంతులకు ప్రధానతత్వ మిదియేగదా! దేహమునకు వెలుపలి సృష్టియు లోపలి సృష్టియు యిందు పొందు పరచినాడు.

నార:—

పెద్దలుగట్టిన గూడన్నా యిది-బ్రద్దలుగూర్చిన గూడన్నా!
గూటిలోన కేరుచుయొకపిచ్చుక-నాటకమాడునురోరన్నా!
వాటముదప్పినగూటివిడిచి-తావనమున కెగురునురోరన్నా!
యిదిదారన్నా! గనలేరన్నా! పామరులైన్నా॥ ఆహా॥

లీలా:—ఈగానమాధుర్యమహిమనునాకు కన్నులు మూతలుబడుచున్నవి. (కునికిపా ట్లభినయించును)

నార:—

తొమ్మిదిజేనల చెట్టన్నా-యీ చెట్టుచివర నొకపుట్టన్నా
పుట్టమధ్యమున రెండుకలుగులకునట్టనడుమనొక వెలుగన్నా
గట్టిగజూచిన వారికావెలుగు-బట్టబయలగును రోరన్నా
యిదిదారన్నా! గనలేరన్నా! పామరులైన్నా॥ ఆహా॥

లీలా:—(నిద్రంబోవుచున్నది)

నార:——ఈయమ్మ నా గానమాధుర్యమున తన్మయత్వము నొందినది. ఈమె గర్భంబునఁగల శిశువునకు నారాయణ మంత్రబోధనముఁ గావించుట కిదియే తగినయదను. ఇంతలో యెవ్వరును రారుగదా! (ఇటునటుఁజూచి లీలావతి చెవిలో మంత్రోపదేశము నొనరించును)

సావేరి——మిశ్రజాతి

స్మరణే సుఖం-శ్రీహరి నామ॥ స్మర॥
స్మరణే భవాబ్ధి-తారణము-పాపహరణము॥ స్మర॥
నహినహి భూలోకానందము లనకు-రా
దిహలోకస్సుఖము సుంతయు వెంట-మనకు
అహాహా! మాయావృత-మగు జన్మమిది మహా
మహులే యింగాఁజిక్కి-మమతల సృక్కేరు॥ స్మర॥
బాలా! గుర్తింపుమీ-పరమార్థమెద్దియో
లోలత్వమునఁదగిలి-శ్రీలాగోరకుమా!

మి॥ తోలునర వసియించుజీవుఁడు-తొల్లి జేసిన కర్మవశమున
చాలునింతటితోడనైనను-శాశ్వతానందంబునొందగ॥స్మ॥
రంగుతనువునునమ్మి-దొంగలాగ్గురి చేత
భంగపోయెద వేని-బ్రతుకేది నీకింక

మి॥ అంగపంజరమందుజీవుఁడు-లింగరూపముఁదాల్చి తాని
స్సంగుఁడై వశియించు నంటక-చావెఱుంగని వానిఁ దెలి
యఁగ॥ స్మర॥

(సంతోషముతో) ఇంక భయములేదు. యోగ దృష్టిచే బాలునకు దివ్యజ్ఞానోపదేశంబుఁ జేసితినిగదా! (అలకించి) గర్భస్థుండేదియో పలుకుచున్నాడు. (నిదానించి) ఆ! తమ బోధనామృతంబున ధన్యుఁడనైతి ననుచుంటివా? నేనింక యిహమున కంకితననుచుంటివా? బిడ్డా! నిజముగా నీవు ధన్యుఁడవే. పరమభాగవతోత్తముండవై చిరంజీవివి గమ్ము. నాయనా! చిరంజీవివిగమ్ము. (ముందుకుజూచి)అల్లదే! సందడి వినిపించుచున్నది. గనుసుముండా కొడుకులు దేవేంద్రునిఁగొనివచ్చుచున్నారు కాబోలును. అమ్మా! లీలావతీ! నిదురించుచుంటివా? నీభర్తగారు వచ్చుచున్నారు లెమ్ము.

[అంత హిరణ్యకశిపుఁడు దేవేంద్రుని బంధించి గొనివచ్చును]

హిర:—(లీలావతినిఁజూచి) దేవీ! ఇదే నీమెడ నపరాధమొనర్చి తులువను బంధించి యీడ్చుకొని వచ్చితిమి. ఈతులువ కేమిప్రాయశ్చిత్త మొనరింపమందువు.

నార:—(దేవేంద్రునిఁ జూచి తనలో) అయ్యో! ఈతడెంత భయభ్రాంతుఁడై యున్నాడో! పాపము. గడగడ వణఁకిపోవుచున్నాడు.

లీలా:—నాథా! వీని నేమియు ననకుడు. వీని కీపరాభవమే చాలును. పోమ్మనుఁడు.

శకు:—(దేవేంద్రునిఁజూచి) ఓరీ సునాసీరా! బుద్ధి వచ్చిందా? చేసిన తప్పునకు అమ్మగారికాళ్లకు మ్రొక్కు. లేకున్న నీపడుము కీఘ్లాడఁదన్నుదను.

శంబ:—వెయ్యికళ్ల దొంగా! అనుమానించెద వెందుకు? మా వాఁడు చెప్పినట్లు చేయును. (ముందుకు త్రోయును)

నార:—అయ్యా! ఈతని నింకేల బాధించెదరు? ఆవిడ చెప్పినట్లు లజ్జాపరివృతుఁడై యున్న యీ వెఱ్ఱివాని నింక విడువుఁడు.

శకు:—(నారదునిపై కనులెఱ్ఱఁజేసి చూచి) నీ దొంగ మాటలు మాకు నచ్చవు. మాటలాడకూరుకో. లేకున్న నీ మర్యాద దక్కదు.

దేవేం:—ఓ దనుజ కింకరులారా! నన్నేల తూలనాడెదరు? బుద్ధిమాంద్యమున చేసిన పొరబాటునకు రాక్షసేశ్వరుని బ్రతిమాలుకొనియెదను. నన్ను క్షమింపుఁడు.

నార:—(తనలో) పాపము. ఇది యీతడు నిలువెల్ల చచ్చి యన్నమాట.

దేవేం:—(హిరణ్యకశిపుని బ్రతిమాలుచు) రాక్షసరాజా! పెద్దవాడను నన్ను క్షమింపవా?

హిర:—అదుగో! ఆటెక్కేమిటి? రాక్షసరాజా! అన్నమ్మాటేమిటి? నీకుమాత్రము రాజును గానా? నీకన్న మాటేమిటి? ముజ్జగంబులకు రాజును నేను.

శంబ:—ప్రభువుగారని యఘోరించవోయి వెట్టిమొగమా!

దేవేం:—(తనలో) వీరిపుడు నన్నేమన్నను పడ వలయును. లేనిచో నన్నువిడువరు. కాలము దప్పి వచ్చి నపుడు గాడిదకాళ్లనైనను పట్టుకొనక తప్పదు. (ప్రకాశ ముగా) ఓ లోకనాయకా!

తే॥ గీ॥ అన్నదమ్ములమేగదా! । యకట నాదు
తప్పులన్ క్షమియింపంగ । దగదె నీకు
బుద్ధివచ్చెను నీయాన । హద్దుమీర
యింక నన్ బీడగదవయ్య । కింకమాని!

శకు:—ఓహో! ఈతులువ నేడెంత బుద్ధిమంతు డైనాడో! ఏనాడునూ యతుకని యన్నదమ్ముల చుట్టరికము నిప్పుడు గలుపుచున్నాడు.

లీలా:—హృదయేశ్వరా!

తే॥ గీ॥ వయసునం బెద్దవాఁడర్థ । వంతుఁ డలఘు
మాననీయుఁడు మిము బ్రతి । మాలినాఁడు
ప్రల్లదముల కటాక్షించి । బంపుఁడితని
జాలిగల్గెను నాకెంతో । స్వాంతమందు॥

శంబ:—అమ్మగారూ! ఈలాంటి భడవలకు జాలిపడ రాదమ్మా! అయ్యగారి సెలవైనచో ప్రక్కలుఁ విరుగఁ బొడిచి పంపుదును.

హిర:—ఓ దేవేంద్రా! ఆడుది నావద్ద నుంటచే బ్రతికిపోతివి. లేకున్న నిన్నేమిచేసిననూ పాపములేదు.

కదనకుతూహలము—ఏకతాళము

నీరాజ్యము నాకొసగెదవా?॥ నీరా॥
వీరా! నిర్జరవీరా! పలుకవు॥ నీరా॥
నిరతము నీవేశ్యలునాముంగిలనునృత్యముసేయగవలెరా-విూ
సురులు నన్గొల్వవలెరా-నా-దరిని బ్రతుకుచుండవలెరా
స్థిరముగస్వర్గము నేనేలెద నీ॥ రాజ్య॥
హద్దుమీరినను-మీగర్వంబుల-దిద్దెదనిదిమరువకుడీ-కడు
పెద్దగ హరిఁదలచకుఁడీ-నా-వద్ద వాని నెత్తకుఁడీ
వద్దువద్దునాచేదండనఁబడ-వద్దువద్దుయాజ్ఞకుబద్ధుఁడవై॥రా॥

దేవేం:—(తనలో) కటకటా! ఇంకేమిసేయఁగలను. ఎంతకాలమో నాకు వీనిచెంత భార్యబిడ్డలతో దాసత్వము. కానిమ్ము. దైవము లేడా! (ప్రకాశముగా) భువనేశ్వరా! నీయాజ్ఞకునేను సదాబద్ధుఁడనే. నీదయ. ఎటులజేసిననుసరే!

పీలువా—మిశ్రజాతి

పోయివత్తు సెలవిడుమా॥ పోయి॥
నాయెందున-దయయుంచుమ-నన్నేలుమ-సమ్మతితో॥పో॥
దితినందన! నీకింకర-సతతము సేవలఁజేతుము
వెతలుగలుగ-నీయకమము-బ్రతుకనిమ్ము-బ్రతిమాలెద॥పో॥
నందనవనమా నాకము-సందియమేటికి యేలుము
యెందైనక-నీస్వేచ్ఛకు-యెదురుండునె-త్రిభువనముల॥పో॥

అంపెద నచ్చరలనాడఁ-బంపెద కిన్నరులఁబాడ
యింపుగ నం-గీకరింపు-మిపుడే నేఁ-జనివచ్చెద ॥పోయి॥

హిర:—అనుగ్రహింపబడితివి పొమ్ము. నేడే స్వర్గ పురి మధ్యంబున రాక్షసధ్వజమును స్థాపింపుము. భార్యా బిడ్డలు దక్క మిగిలిన సకలహక్కులను వదలుకొనుము. రేపే నేను స్వర్గవిహార మొనరింప వచ్చెదను. పురిని శృంగారము జేయింపుము.

శకు:—పొమ్ము. జాగ్రతగల్గి మసలుకొనుము. మీ దివిజ లందరితోను మా రాక్షసులకు వంగి సలాము లొనరింపుచుండులాగునఁ జెప్పుము. లేకున్న మీఁగుండె లలో పచ్చళింతుము. నాపేరుశకుని. జ్ఞాపకముంచుకొనుము.

(దేవేంద్రుఁడు తలవాల్చి చనుచున్నాడు)

హిర:—ఓ దానవవీరులారా! నేడే మీకు దిగ్విజయంబొనరింప యాజ్ఞయిచ్చితిని.

బ్యాంగుట్యాను—ఏకతాళము

పొండుపొండుమీదనుజుల్-దండుగూడితండములై ॥పొం॥
బిరబిరగా-వరమునియా-శ్రమములఁగాల్పర్-తపములఁ
జెరుపరే॥ పొండు॥

ముక్కు-చెవులుఁగోసిమునుల-చిక్కుఁబెట్టుఁడీ
యొక్కడగలఁడాహరియని-నొక్కియడుగుఁడీ

విక్కశోధించి విష్ణుఁడెక్కడనున్నాఁడో జూచి
చక్కగరండీ వేగమునఁ - చయ్యనఁగనిరండీజయముగ॥పౌం॥

సంశయింపకుఁడు. ఆలయంబుల పతనమందిరంబుల ప్రాఁదోటల యజ్ఞశాలల వేదాదిగ్రంథముల దగ్ధమొనరింపుడు. తపసులఁ గాంతలఁ పశువులఁ నిశువులఁ యుసురులందీయుఁడు. యేవిధముననైన శ్రమపడి హరి యున్నతావు నరయ దీక్షపట్టి వెదకుఁడు. మిమ్మెదిరింప వచ్చిన దురాత్ముల పొగరడంచుఁడు. మిమ్ము మీటువాడైన నాకు వార్తనంపుఁడు. నా నిశితశూలంబున యా శాత్రవుల వృక్షంబులఁగ్రుమ్మి గుండెలఁ దీసి మీకు విందు చేసెదను. ఇదియే నా యాజ్ఞ పోయిరండు.

రాక్షసులు:—చిత్తము. తమ సెలవైనచో ముల్లోకంబుల బుగ్గిచేసివత్తుము. (చనుచున్నారు)

హిర:—చెలీ! రమ్ము. సదనంబున కరుగుదము. ఓ నారదా! నీ వనుదినంబు మా తావునకువచ్చి నీ సంగీతలహరిని మమ్మోలలాడించి మా దయనంది చనుచుండవలయును.

నార:—అయ్యా! త్రిలోకవాసులందరు తమ సేవఁ జేయునపుడు నేనుమాత్ర మేలచేయను? అవశ్యము వచ్చుచుందును. ప్రొద్దుగ్రుంకుచున్నది. సదనమున కరుగుఁడు.

(హిరణ్యకశిపుఁడు భార్యతో నిష్క్రమించును)

నార:—అమ్మయ్యా! నా తలమీదిశని యిప్పటికి వదలినది. ఇంక బ్రతుకుజీవుఁడా యనుకొనుచు, సత్యలోక మునకుఁబోయి క్రూరునకింతలేసి ఘోరవరంబులఁ బ్రసాదించిన నలువను నాల్గు చివాట్లుబెట్టెదను.

(నిష్క్రమించును)

## చతుర్థరంగము

[ప్రవేశము—సత్యలోకమున బ్రహ్మ, సరస్వతి, నారదుఁడు]

బ్రహ్మ:—నారదా! ఇంత కంగారుపడుచువచ్చినా వేమి? ఉపద్రవ మేమైనను సంభవించినదా?

నార:—జనకా! ఏమియు నెరుగని వానివలె మూలఁ గూరుచుండి యిటులడిగెద రేల? నేనన్నమాట యేమిటి? భువనములే కంగారుపడుచున్నవి. తమ దయవలన—

సర:—నాయనా! అటులనుచుంటి వేమిరా!

నార:—ఏమనవమ్మా! అయ్యగారి తెలివి తేటలిటు లున్నవి. "శునకమునకు సింహాసనమిడినటుల" యా క్రూర స్వభావుండగు దితితనయునకు విరుద్ధవరంబులనొసంగి ప్రపంచమును పాడుచేయించినారు.

సర:—లోకములకంత యాందోళనముఁ గావించు చున్నాడా? ఆ హిరణ్యకశిపుఁడు.

నార:—మీరు తెలియనేలేదా? జీవులందరూ యక్షతలను బాలయ్యగారి తలపై వేయనున్నారమ్మా! సృష్టికర్తనుగదా! అని యుక్తాయుక్తములు విచారింపక నీయంతవాడు లేడన్నంతమాత్రముననే యుబ్బిపోయి కోరిన వెల్ల యిచ్చివేయడమేనా? వినుఁ డాతఁడొనరించిన యుపద్రవములు.

సీ॥ నరకప్రభునిగుండె । లడలించి యాతని
చట్టుబుల్లకు సున్నఁ । జుట్టినాడు
స్వర్గాధిపునిధృతి । సడలించి యలయించి
ద్వా:సానదాసునిఁ । జేసినాడు
యలకాధిపునియాస్తి । నంతయుచేపట్టి
చిప్ప యాతని కొప్పఁ । జెప్పినాడు
వనముల్ దిరుగాడి । వరమునియాశ్రమం
బుల దగ్ధమొనరించి । చెలఁగినాడు
తే॥ గీ॥ వారు వీరననేటికి । శౌరి తమరు
శంకరుఁడుఁగాక తక్కిన । సకలలోక
ప్రాణిజాలము లాతని । భయముచేత
నుడికిపోవుచునున్న "వ । ట్టుడికినట్లు"

సర:—కటకటా! ఎంతదారుణ మెంతదారుణము. నాథా! ఇంత పొరబడితిరేల? ఇపుడు తమరేగి వానిని మందలించరాదా?

బ్రహ్మ:—మాధ్యము మేరమీఱినపిమ్మట వానికి మనబోధలు చెవి కెక్కునా? పాకముబొత్తిగాముదిరిపోయినది.

నార:—ఇంకా మీ పున్నముకొద్ది యీ రక్కస మహమ్మారిస్పర్శ మీలోకమునకు సోకలేదుగాని, లేకున్న మీ నాయనగారికే యీ తుంటరి బుద్ధిచెప్పఁగలఁడమ్మా!

సర:—అయ్యో! ఇట్టితరి మామగారేల తన్నుఁ గాదన్నటుల యూరకున్నారు. ఆయనగారుకూడా యీ యనగారివలెనే వెరచి మనకెందుకని యూరకున్నారు కాబోలును.

నార:—ఆ దనుజేంద్రుఁడు ప్రపంచములు హల్లకల్లోలమ్ముఁ గావించుచున్న దందులకేగాదటమ్మా! మిగుల శ్రమలఁబడి చిరకాలము తపమొనరించి నాయనగారివలన వరములనుఁబడసిన దెందుకనుకొంటివి? "దున్నపోతుల కలహము లేగలకాళ్లు విరచినట్లు" నడుమ మాబోటి తపసుల ప్రాణములు యుస్సురనుచున్నవి. అబ్బబ్బా! మునుల యవస్థలు చెప్పజాలనమ్మా! ఆశ్రమభూము లసురనివాసంబులయ్యె. కమండలంబులు కల్లుభాండంబులుగామారె. వటువులు చాలమట్టుకు కఠినరక్కసమూకల కాహారంబులైరి మునిసువాసినులు పెక్కండ్రు మూర్ఖరక్కసులకు చరణదాసినులైరి. పాపముమిగిలినవారు చేయునదేదియు లేక కొండగుహలపాలై బాబయ్యగారిపేరు మరిమరి స్మరించుకొనుచు యేడ్చుచున్నారమ్మా!

సర్వ:—కటకటా! ఎంతవిరుద్ధము. ఎంత ఘోరిషము.

[అంత జయంతుఁడు, అలకూబరుఁడు ప్రవేశింతురు]

బాగుసా—చతురస్రజాతి

సారీ-దానీ-పాదా-మా-గమపా-పమగమా-మగరిగా

హేఏ-శౌర-రాఆ-చా-వఅరా-మా మొరా-లింపరా

గరినిసా-గమపదనిసరిసనిదనీ॥ సా॥

బిరానన్-నిరుపమ సద్గుణ సదనా॥ హే॥

సారీ-దానీ-పాదా-మాపా-గమపదనిదపమపా-పమగమా

నీఇ రాఆ జాఆ సాఆ న అలలలఅఅ-నఅమో

మగరిగా గరిసరీ రిసనిసా-గమపదనిసరిసనిదనీ॥ సా॥

నఅమో నఅమో నఅమో-నిరుపమసద్గుణాసదనా॥ హే॥

గస-గస-గస-గమ-మప-పద-దని-నిస-సనిదపా మగమపా

పరు-వెరు-గక-దితి-తన-యుఁడు-జగ-ముల-పరితపింపఁ
జేసెఁ

సారీ-దానీ-పాదా-మాపా-గమపదనిస-రిసనిదపమ-మపా
సనీ-దా

నీఇ-కీదీ-తగున-బాఆ-నిఇఇఇఇ రఅఅఅఅ-జఆ-గఆ-ర్భా

పమా-మగా-గరీ-రిసా-గమ పదనిస రిసనిదనీ

హా-హా-హా-హా అతఁడిలబడి మొఱచించుమా॥ హే॥

జయం:—ఓ వాంఛాపధేయా! నీవే యాతుల తెలిసియూ తెలియనివానివలె యూరకున్న లోకములగతి యేమి? ఇట్టి లోకకంటకుల కెన్నఁడేని యింతలేసి భీకర

వరంబుల నొసంగితివా? ఇపుడీలోకోపద్రవము తగ్గిపోవుట కేది యోచన?

బ్రహ్మ:—జయంతా! నే నేమి చేయుదును. నా తలకు మీరిపోయినది. అయ్యో! స్వర్గలోకము రాక్షసవశ మయ్యెనుగాబోలు. పూజ్యులగు మీ జననీజనకులు కష్టములననుభవింపుచున్నారని వేరే చెప్పనక్కరలేదు. అలకూబరా! మీ నాయనగారు కుబేరు డేమిచేయు చున్నారు?

అల:—దేవా! ఏమిచెప్పుదును. మా నాయన గారు ఆయువారము చేయుచున్నారు. వీరి నాయనగారు దాసత్వము చేయుచున్నారు.

నర:—కటకటా! ఎట్టి వైభవంబులు దులదూగు వారి కెట్టిపాట్లు వాటిల్లినవి. జయంతా! మీ యమ్మ శచీ దేవికి క్షేమమా? ఎందున్నది?

జయం:—ఏమి చెప్పనమ్మా! ప్రాణములకుమాత్ర ము క్షేమమే.

తే॥ గీ॥ సఖులు చుట్టాలు రాణివా । సంబులేక
బ్రతుకు చింతలపాలయి । పతినిబాసి
వింధ్యగహ్వరమే నిజ । మందిరముగ
బ్రతుకుచున్నది మాయమ్మ । పడతిమిన్న!॥

నార:—కటకటా! కాల మెంతవిపుద్ధముగా నున్నది. జయంతా! నీవిపు డెందుండివచ్చితివి?

జయం:—వింధ్యాటవినుండి యెవ్వరికి తెలియకుండ ప్రాణము లరచేతఁ బట్టుకొనివచ్చుచుండ త్రోవలో నావ లెనే వచ్చుచున్న యీ యలకూబరుఁడు తారసించినాఁడు. అంత యీతని సడివిని నేనున్నూ, నా సవ్వడివిని యీతఁడును కొంతసేపు టకటకలాడిపోయినాము.

బ్రహ్మ:—కుబేరనందనా! మీ రెచ్చటనున్నారు?

అల:—అయ్యా! మేము మేరుపర్వతగుహాలయందు నివసింపుచుంటిమి. మా నాయనగారు తమకు తన బన్నముల నివేదింపుమని నన్నంపినారు. అలకాపురము రాక్షస నివాసమైనదనిగూడ మరిమరి చెప్పుచున్నారు.

బ్రహ్మ:—(ఆలోచించి) ఏమియోచన. మన మందరము సావకాశముగా నిర్మలచిత్తంబులతో శ్రీహరి నారాధింతము ఆయన యేమిసెలవిచ్చునో!

నార:—ఔను. మన లోపములనుఁ దీర్చుటకు తాతయ్యగారే తగినవారు. భజింపుఁడు.

(అందరు ధ్యానమగ్నులై)

ఖరహరప్రియ—తిశ్రజాతి

నిసగమపసనీ-దప గామ రీగరిసా

ఇంతకన్న సమయా-మిక రాదు తండ్రీ॥ ఇంత॥

షనిధపమ పనిసరీగరిసనినా-నిసనిరిసని-పనిపసనిప-మపమని
పమ

పంతమూన దగునటయ్యా-పరమపురుష-మురహరమా
మొరమరిమది

రిమపా-పమగరిగా-మగరిసరీ-పమగరిసానిస॥
వినవో-జాలిఁగొనవో-దయఁగనవో-అరమరలేలర॥ ఇంత॥
ఎపుడాదనుజునిఁదునిమీ-కృపఁజూపెదవోగానీ
అపరిమితభయంబుగల్గెరా-బ్రోవరా-దేవరానీవరాలొసగుము॥
ఇందిరలోలా! జాలము-యెందుకు సచ్చీలా!
* మంధరధర సర్వ-బృందారకపాల-మంజుశ్రీపాద
సింధుగేహా! రాదా? దయనీకు-వాదా? మాతోడ
క్రీడా! సత్సామ్రాజ్యపాదా-భూనాథ॥ ఇంత॥

(అంతరిక్షమున ధ్వని)

వెరువకుఁడు వెఱువకుఁడు. ఆ తులువకు కాల మాసన్నమగుచున్నది. కొలదికాలంబున పరమభాగవోత్త ముండగు కన్నకొడుకుపై వైరమూని, నాచే మడియఁ గలఁడు. ఇంక కొంతకాల మోర్చుకొనుఁడు. నేను నారా యణుండను.

అందరు:—(సంతోషముతో) ఆహా! ధన్యోస్మి! ధన్యోస్మి! ఇంక హిరణ్యకశిపునికాలము దాపురించినది.

వాని వైభవమూడును. సందియము లేదు. అంతరిక్షమున దైవవాక్యము వినిపించినది.

[అంత నముచియను రాక్షసదూత వచ్చుచున్నాడు]

నము:—(ద్వారమువద్ద నిలిచి) విధాత యెందు న్నాడు. నేను లోనికి రావచ్చునా? పలుకరేమి? నాకు జాలము పనికిరాదు.

నార:—(ఆలోచించి) ఎవడువీడు. ఇంత గర్వోద్రేకంబున కేకలువైచుచున్నాడు.(బిగ్గరగా)ఓయీ! ఎవరునీవు?

నము:—నేను నముచిని. హిరణ్యకశిపుని భటుండను. మా ప్రభువనుప వచ్చితిని.

(జయంతుఁడు అలకూబరుఁడు బ్రహ్మపీఠము వెనుక దాగుచున్నారు)

నము:—(సమీపించుచున్నాడు)

నార:—నీవటయ్యా! ఎవ్వరోయనుకుంటిమి. ఏవిం దేమిపనియుండివచ్చితివి?

నముచి:—కడచిన రేయి మా ప్రభువుగారికి పుత్రుండుదయించినాడు. అందులకు నేడు మొదలు మూడునాళ్ల వఱకు మహోత్సవంబుల నాచరించుచున్నారు. సకల దిక్పాలురు కట్నంబులు కానుకలంగొని రాక్షసేంద్రుని దర్శించి యాబిడ్డని దీవించి పోవుచున్నారు. ఈవార్త సత్యలోకమునకు కూడఁ బ్రకటింపవచ్చితిని.

బ్రహ్మ:—అవశ్యము వత్తుము. నీవు చనుము.

నముచి:—వచ్చెదవంటే కాదు. వెంటనే రాకున్న ప్రభువుగారి యాగ్రహమునకు పాత్రులగుదురుజుమా!

నార:—అట్లే వత్తుము. ముల్లోక చక్రవర్తిగారు పుత్రోత్సవ మొనరింపుచుండ రాకుందుమా దేనికి? నీవు పొమ్ము. (నముచి నిష్క్రమించుచున్నాడు)

(జయంత అలకూబరు లిద్దరు యీవలికి వచ్చుచున్నారు)

జయం:—అమ్మయ్యా! నత్తకాయంత బండముండా కొడుకునుజూచి నాప్రాణములుగిజగిజలాడిపోయినవయ్యా!

నార:—చూచితిరా! గడ్డిపరక జేయని యీ చెత్త వెధవతమళ్లోడ నేయెంత గర్వముగా మాటలాడిపోయినాడో

బ్రహ్మ:—వానిలో నేమున్నది. అది యంతయు నడిపించువానిలో నున్నది. కానిండు. ఇంక కొలదినాళ్లే గదా! వీనికీవైభవము. నేను మనమందరముజని యాభక్త బాలుని దర్శించి యాశీర్వదించి వత్తమురండు.

అల:—అవును. నలుగురితో బాటు కట్నములు కానుకలు వానిమొగమునఁ బడవైచిరాకున్న మనపై పగ బూనును. రండుపోవుదము. (అందరు చనుచున్నారు)

## పంచమ రంగము



[ప్రవేశము అంతఃపురమున లీలావతి, ప్రహ్లాదుఁడు]

లీలా:—నాయనా! ప్రహ్లాదా! వేళ కన్నము కూడ మరచి యింతవర కెచ్చటనుంటివి? నిన్న నీ మెడ యందు ధరించిన పసిఁడిహారమేది? ఎక్కడ బారవైచితివి?

ప్రహ్లా:—పారవేయలేదమ్మా! దానిని నారాయణ మూర్తి కర్పించితిని.

లీలా:—(ముద్దిడి) నాతండ్రీ! నీకు నారాయణమూర్తి యెక్కడ గాన్పించినాడు?

ప్రహ్లా:—వెఱ్ఱితల్లీ! నారాయణమూర్తి యెక్కడ లేదమ్మా! ప్రపంచమున పరమాత్ముఁడు లేక యేది నిలుచును. భగవంతుఁడు చిద్విలాస పురుషుఁడు. సకలాంతర్యామి. ఆయన స్వేచ్ఛయే గాదటమ్మా! ఈజగములు. నిన్న నేను రాచవీధిని చిత్తముమరచి భజనఁజేసుకొను చుండ భగవంతుఁడు నామెడయందలి హారమునుఁ గొని పోయినాఁడు.

లీలా:—చోరులు హరించిరే కాబోలును. ఇంకను కొంతనయమే. వారు ప్రాణములఁదీసినను తీయఁగలరు.

ప్రహ్లా:—ఏమమ్మా! నీయజ్ఞానము! ప్రాణములఁ దీయువాఁడెవ్వఁడు? ఏది చేసినను వాఁడే చేయవలెనుగాని—

బ్యాహవా — ఆదితాళము

జగములన్నిటికి సర్వేశుఁడే గదా! శాశించు తనకోర్కె-
లొగిన్-నాయమ్మా॥ జగ॥

జగమంతా హరిమయము-జనులకేమియొసక
జననీ! మనచే నేమగున్-నాయమ్మా॥ జగ॥
ఒకనినాడించు-మరి-యొకనిఁబాడించు-వే
రొకని నేడ్పించు-యిం-కొకనినవ్వించు-యీ
రకమున సకలమున్-రంజిల్లఁజేయునమ్మా॥ జగ॥
అన్నియుఁ దనలోను-యన్నింటిలో తాను
కన్నవారల కాతఁ-డున్నాఁడు లేడను
కున్నవారికి లేడా-పన్నగశయనుఁడు॥ జగ॥
నే జేసినానని-దేహభ్రమయే గాని
తా జేయునది లేదు-తల్లీ! కాసింతేసి
జేజే సంసేవ్యుఁడే-గాదే జేయునదెల్ల॥ జగ॥

అమ్మా! నా హారము నెవ్వరో హరించిరనుకొనకుఁ డానిని భగవంతుఁ డెచ్చట నుంచదలఁచినాఁడో అచ్చటనే యుండును. అదియునుఁగాక నాకు సొగసులయందిష్టము లేదమ్మా!

తే॥ గీ॥ కర్మవశమునఁ గల్గు నీ । కల్లతనువు
యెల్లియో నేడొ యెచటనో ।

నగలునాకేల హరిభక్తి । నగమె చాలు
తొలుకొంపకు యందము । లేలనమ్మా!

లీలా:—(ఆశ్చర్యముతో) బిడ్డా! నీకింత బాల్యము నందే యీభక్తి యెటుల నభ్యాసమైనది? పోనిమ్ము. వలదన్న నీకు నగలనుఁ జేయించనుగాని నీతండ్రిగారి కీభక్తి మార్గమన్న తిలనొప్పి. ఆయనగారు చూచుచున్నపుడు మాత్ర మీ భక్తిమార్గమును మరుగుపరచుచుండుము. నేను నిన్ను కోరుచున్న దిదొక్కటే.

ప్రహ:—అమ్మా! ఆయన యదృష్టమది. నామత మిది. నేనేమిచేయగలను. భగవంతునియందు మగ్నమై యున్న నాచిత్తము నెటుల మార్చగలనమ్మా!

లీలా:— బేహాగ్—మిశ్రజాతి

నినుగనలుగుర్ - నీజనకుఁడు - తనయా! యిదిమానుమా!
తనమనమున - కిదితగనిది - తనయా! నా - మాటవినుము॥ని॥

ప్రహ:-అమ్మ యెన్నియైనర్ రానీ - హరిభజనము మాననే
లెమ్మా లెమ్మనీ - మాటలునా చెవి - కిమ్ములుగావో॥జననీ॥

లీలా:-వినవా! మాట - వినవా? నీజనకుని మతిఁగనవా॥ ని॥

ప్రహ:-అమ్మా! యిహాము నేనొల్లను - యయ్యయల్క - నాకేటికి
నెమ్మదిశౌరి ప-దమ్ములఁ బాయదు - జమ్మా స్వామి ప
దమ్ములసాక్షిగ॥ అమ్మ॥

అమ్మా! నీకును యించుక సామర్థ్య మున్నదిజూసూ!

తే॥ గీ॥ పాపచయముల పుట్టిల్లు । భక్తపితతి
దూషితంబు నిరంతర । దుఃఖరాశి
పాడుసంసారమిది చూచి । భ్రమసెదేల?
నంధకారముఁగన్న ది । వాంధమటుల.

ఇందేమిసౌఖ్య మున్నదమ్మా! తెలుసుకొన్న దివ్య జ్ఞానుల కల్లదే (పైకిఁజూపి) అటుఁజూడు. ఆ నిత్యానంద తేజము-ఆ పరమాత్మస్వరూపము-ఆ పండువెన్నెల ఆహా! విశ్వమయుం డెటుల తాండవమాడుచున్నాడో! వహ్వా! వహ్వా! (గంతులువైచుచు)

సింధుకమాచి

ఆడుచున్నాడే-తాండవ॥ మాడు॥
వెడఁజూచినను తానై-వేడుకతో-విశ్వమయుం॥ డాడు॥
చూడవమ్మ! లోకరంగ-సూత్రధారుఁడై-తన
నీడలు జగమెల్లనిండ-నిఖిలపూర్ణుఁడై
యీడాపింగళులనడుమ-చూడ చోద్యమగు వెలుఁగై
పాడుచు నాలో నీలో-పరికించెడు కన్నులలో॥ నాడు॥
జగమనునాటకశాలను-నిగనిగమని మెరయుమాయ
సొగసగు తెరనొకటిగట్టి-చూడవె తన వేడుక
అగుపడియగుపడనట్టుల-యంతలోన పలువేషము
లగుపరచుచునుండెగాంచ-వమ్మా మది కెంతోహాయి॥ఆ॥

భళిరే! భళిరే! మా బాబయ్యా నటనమునకుఁ బ్రహ్మాండభాండమదరి ప్రతిధ్వనించుచున్నది. హాయిహాయి!
(పరవశుఁడగుచున్నాఁడు)

[అంత హిరణ్యకశిపుఁడు ప్రవేశించును]

హిర:—పుత్రా! నా నటనమునకు బ్రహ్మాండ మదరిపోవుచున్నదని నీవు మెచ్చుకొనుచున్నావా? నావ లెనే నీవును ముజ్జగంబుల నడలించి యేలవలయును. మీ పినతండ్రినిజంపిన యా చక్రిని వధించి మనపగఁ దీర్చుకొన వలయును. (ఆశ్చర్యముతో జూచి) కాంతా! ఇదియేమి? పలుకడు. ఇట్టుల కర్రయైపోయినాడేమి? (దరికేగి కొడు కును తట్టుచు) నాయనా! ప్రహలాదా!

ప్రహ:—(తండ్రినిఁజూచి) బాబయ్యగారా? ఎప్పుడు వచ్చినారు?

హిర:—వచ్చినదేమెరుగవా? నిలుచుండియే కునికి పాట్లుబడుచుంటివా?

ప్రహ:—లేదండీ! నిశ్చలతత్వముతో ప్రపంచ స్వభావము నరయుచుంటిని.

హిర:—చెలీ! ఈతని కింకనూ యీ వెర్రితనము విడువలేదా?

లీలా:—ఇంకా పసితనముగదా! మనసెటుబోయిన నటులే అదియొకయాట.

హిర:—సరిసరి. వీనినింక యాగడముగా విడువ రాదు. జ్ఞానశూన్యుఁడైయున్న వీనికిప్పు డలవాటుఁజేయకున్న ముందుముం దలవడదు. ఓ తనయా! నీ వెఱ్ఱి పాటలు వెక్కిరింతగంతులు నాకు నచ్చవు. నిన్ను మన గురువులవారియొద్దకుఁ గొనిపోయి విద్యాభ్యాసముఁ జేయించెదనురమ్ము. (చేయిఁబట్టుకొనును)

లీలా:—(పుత్రుని శరీరమును దువ్వుచు) తండ్రీ! మీ నాన్నగారి వెంటఁజనుము.

కం॥ చదువనియెడ మూఢుండగు
చదివిన సన్మార్గప్రజ్ఞ చతురతలొందవృక్షా
చదువక జను మొజ్జలదరి
చదువని నిర్భాగ్యుకన్న చాకలిమేలా॥
(అందరు నిష్క్రమింతురు)

## షష్ఠమరంగము

[ప్రవేశము—చదువులబడిలో ప్రహ్లాదుఁడు, వసంతుఁడు, శంబరుఁడు, గాలవుఁడు]

వసం:—రాజనందనా! మన పంతులుగారు బడికి వచ్చువేళయైనది. నీకు పాఠము వచ్చినదా?

ప్రహ:—నాపాఠమెంత! అప్పటికప్పుడే వచ్చును మనపంతులుగారు వచ్చు యీలోపున యొకపర్యాయము ఆనందముగా హరిభజనఁ జేసుకొందమురండు.

గాల:—నేను రాను బాబూ! నిన్న నీవు నేర్పిన హరికీర్తన మాయింటిదగ్గర పాడుకుంటుంటే మాయయ్య నన్ను చితకకొట్టాడు. అది మనం పాడకూడదంట. మీ నాయనగారికి తెలిస్తే చంపి పాతరేస్తారంట. హరి హరీ! అంటే హరించిపోతారంట. హరంటే దేవుడని చెప్పావు కాదూ నాకు!

ప్రహ:—అవును. కాదన్న దెవరు?

గాల:—కాదంట. మాతాతయ్య చెప్పాడు మొన్న. వాడికి యిల్లు లేదంట. వాకిలి లేదంట. సముద్రాల్లో చేపయో, బురదగుంటల్లో తాబేలయో, మరుఁగుదొడ్లలో పందయో తిరుగుతుంటాడంట. దొంగోడంట బాబూ!

ప్రహ:—అవును. నీవంటి శుద్ధశుంఠలకు దొంగవాడే! పాపాత్ములగు మన రాక్షసజాతి కా శ్రీహరినామము ప్రాప్తిలేదు. ఓరి మూర్ఖుడా! మాతాతయ్య చెప్పినాడు, మానాయనమ్మ చెప్పినది యనక మాతోపాటు నీవుకూడా భజనఁజేసుకో మరల జన్మముండదు.

గాల:—మళ్లీ జన్మముండకపోతే మన కేమిసుఖం? తినడానికి మాంసము, త్రాగడానికి పుల్లనికల్లు దొరకడ మెల్లాగ? మనయమ్మ, మనబాబు కనిపించకపోతేయెల్లాగ?

ప్రహ:—ఓరిమూఢుఁడా! పసితనమునందే యిహ సుఖమునకు మఱిఁగిన నీవింక పెద్దవాడవైన నీయాతనకు మేరయే యుండదు. నరకమున యమకింకరులు నిన్నీడ్చి యీడ్చి తన్నుదురు. కొంతకాలమునకు నిన్ను మరల యీ సంసారమను బురద గోతిలోనికే త్రోసివేయుచుం దురు. నీ బ్రతుకింక యెంతకాలముజూచినా వరుసగా గర్భ నరకము, భూనరకము, యమనరకమే. ఇంక పైకిరాలేవు.

శంబ:—ప్రహలాదా! నరకమంటే యేమిటి?

ప్రహ:—మనము చేసుకున్న పాపములకు తగిన ప్రాయశ్చిత్తము లనుభవించేతావులే నరకములనఁబడును. అట్టినరకములు మూఁడు మనకొఱకు నిర్మింపఁబడినవి.

వసం:—అయ్యా! యమధర్మరాజుగారు నరకములో పాపాత్ముల నేమిచేయుదురు?

ప్రహ:—ఏమి చేయు నురా!

సీ॥ పరకాంతఁ బెనఁగిన ׀ పాపాత్ముఁడీతని
నగ్గికంబంబున ׀ కదుముఁడనుచు
సాధులఁబీడించు ׀ శనిగాఁడు వీవిని
కఱకురంపంబున ׀ నరుకుఁడనుచు
జాలినెరుఁగని ׀ చవట యీతని చర్మ
మొలిచి క్రాగిననూనెఁ ׀ జిలుకుఁడనుచు

గడ్డికాసుకుతిన్న । కసులోభి యాతని
పొట్టఁ బెకల్చి రాల్ । గొట్టుఁడనుచు
తే॥ గీ॥ అగ్నిలోఁ ద్రోచి రక్తము । నందువైచి
క్షారతలంగ్రుచ్చి కత్తులఁ । గోసి పెక్కు-
బాధలఁ ద్రోయుచుందురు । పాతకులను
దయనెరుంగని యా దండ । ధరునిభటులు!

శంబ:—అయ్యా! గర్భనరకమంటివిగదా! అది యేమిటి?

ప్రహ:—మన తల్లిదండ్రుల సంభోగవ్యాపారముల చేత రక్తశుక్లము లేకమై స్త్రీగర్భమునందు తోడుకొని పిండరూప మగుచున్నది. తొల్లింటి కర్మవశంబున జీవుం డందు ప్రవేశించి మలమూత్ర రక్తమాంసాదులతో నిండిన యా మురికిగుంటయం దుక్కిరిబిక్కిరియై వెడలుమార్గంబుఁ దెలియక కొన్నాళ్లందుఁ గొట్టుకొనుచుండును. అందా దేహికిఁ గల్గుబాధ లింతింతని చెప్పరానివిగదా!

గాల:—భూలోకములోఁ గూడా బాధలున్నవన్నావు గదా! ఏవి?

ప్రహ:—వెర్రివాడా! అవి నీబోటియజ్ఞానికిఁ దెలియనివి. నీలో నీవు నిదానించి చూచినఁగాని బోధపడవు. భూలోకబాధలు పైకి యానందపూతలు. ఎంచిచూచిన అన్నియు రోతలే. రోతలే. వివరించెద వినుము.

సీ॥ చిఱుతిండికిఁ గూర్మి । చెలులకై కొన్నాళ్లు
కామదొప్ప సతులకై । కొన్నినాళ్లు
పసలేని సుఖములఁ । బడయంగఁగొన్నాళ్లు
కొడుకులు లేరంచు । కొన్నినాళ్లు
కడుపుకక్కూర్తికై । కంగారుకొన్నాళ్లు
గొప్ప వియ్యాలకై । కొన్నినాళ్లు
కడురోగములఁజిక్కి । మిడుకుటకొన్నాళ్లు
కోడండ్రతో పోరు । కొన్నినాళ్లు
తే॥ గీ॥ కడకు ముదిమి యావేశింప । కాయమొంద
నోరుబోక్కయై కటిబిగి । జారిపోవ
ఘోరబాధలఁ గుందుట । కొన్నినాళ్లు
యింక సుఖమేది చెప్పుడీ । యిహమునందు॥

గాల:—అల్లయితే పెండ్లాము రావడం, బిడ్డలు పుట్టడం బాధలేయంటావా?

ప్రహ:—అవునో కాదో ముందు అనుభవమువీద నీకే తెలియును.

వసం:—అటులైన భూమిపై జన్మమెత్తినవారికి సంసారమును చుట్టఁబెట్టుకొనక తప్పదుగదా! అట్టియెడ సంసారమునందు భక్తుఁడగువా డేవిధముగా నుండవలెను?

ప్రహ:—భక్తుఁడు కర్మానుభవమున కొకవేళ సంసారమునఁ బడినను తుళ్లుమంటిలో తుమ్మరపురుగువలె

తామరాకునఁగో నీటిబొట్టువలె నంటియు నంటక జాగరూకుఁడై యుండి తానెటుల బయటఁబడుదునా? యని ముక్తికి వెదకులాడుచుండును.

శంబ:—పసితనమునందే నీకింతజ్ఞాన మెటులకల్గె నయ్యా! ఇంక పంతులుగారు బడికి వచ్చువేళయైనది. మనము మాటలసందడిని భజన మరచితిమి.

ప్రహ:—అవును. ముఖ్యముగా భజన చేయవలసినదే. నేను ముందుబాడెదను. మీరు నావెనుక నందుకొని పాడుఁడు.

అందః:—జయ రమారమణగోవిందో హరిః!

(చేతులతో తాళములు వేయుచు)

సింధుకన్నడ—చతురశ్ర

కడతేరేదేనాడో-దరిజేరేదేనాడో॥ కడ॥

విడువక శ్రీహరీ! నీ యడుగుల

మడుగుల నిడుచుఁగ హాయిగ॥ కడ॥

పుడమినీ దారుణ కలుష నిచయముఁ-బొందలేను స్వామీ! యీ

కడుహేయసుఖంబులకుఁ సుంతయుఁగాంక్షించనుభూమిం

విడువక యార్గురుదొంగలు నామది-విరచఁ జూచుచు

నున్నారయ్యా!

పడఁజాలను వారితోడ పోరఁగ-బడఁద్రోచితి విహానున
నేమయ్యా॥ కడ॥

అల్లరిలోకమునందునా యాస-ద్రెళ్లదయ్యస్వామీ! నా
వల్లగాదు తరియింప నీభవనము-చల్లఁగ ఖగగామీ!
కల్లతనువు-యిల్లుమిథ్యయెవ్వరుఁగారునాకునీవుదక్క-కా
మెల్లఁగమృత్యువు యెన్నఁడంచు పులి-పిల్లరీతిఁ బొంచి
యున్న యిహామున॥ కడ॥

(గంతులు వైచుచున్నారు)

(చండుడు బెత్తముఁబట్టుకొని పరుగెత్తుకొనివచ్చి)

అల్లరికుంకలారా! అదుగో! కోతులభాగవతము ప్రారంభించినారా? ఒకఘడియ నేనులేకుంటే పాఠశాల కసాయి దుకాణముక్రింద మార్చివేస్తారుగదా! అబ్బబ్బా! మీతో వేగలేక చచ్చిపోవుచున్నాను. చూడండి. మీ వీపులు చిట్లవేస్తాను. (కొట్టుచు) ప్రహ్లాదా! రాజనందనుఁడవని నిన్నుపేక్షఁ జేసినకొలఁది నీయాగడము మేర మీరిపోవుచున్నది సుమా! చూతు మీనాయనతోఁజెప్పి నిన్నేమిచేయిస్తానో! (గాలవునిఁజూచి) గాలవా! నాలుక తిరుగని మొద్దుపీనుఁగునని యేడుస్తావు. గంతులు వేయడానికి కాళ్లు లేస్తున్నవటరా? (కొట్టఁబోవును)

గాల:—(కాళ్లుబట్టుకొని) పంతులుగారండీ! నన్ను కొట్టకండి! మీకాళ్లు పిసుకుతానండీ! నేను మొద్దువెధవ

నండి! నాకు చదువురాదండీ! నన్నుచంపకండిబాబయ్యా! మీాకు దండాలండీ! నాకు డొక్కలో తలకాయనొప్పి వస్తుందండి. నన్నువిడిచిపెట్టండి. (బతిమాలుచున్నాడు)

ఛండు:—ఓరిటక్కరిపీనుగా! నీకు డొక్కలో తల కాయనెప్పివస్తుందా? తగినఔషధము వేస్తానుండు. నిన్ను విడిచిపెట్టఁగూడదు. (మొత్తుచున్నాడు)

గాల:—(పెద్దగొంతుకతో నేడ్చుచు) నన్ను కొట్ట కండిబాబో! ఇంటిదగ్గర కక్కుకున్నానండీ! ఇంకా మా వాళ్లనడగండీ! ఈ వెధవపాఠాలు నాకు నోరుతిరగవండీ! మీా పాదాల్తొక్తి బ్రతుకుతానండి. ఆనక యింటిదగ్గర యింత బెల్లంముక్క యెత్తుకొచ్చి మీాకుఁ బెడతానండీ! నన్ను విడిచిపెట్టండీ!

ఛండు:—అల్లరికుంకా! నాకు లంచాలుకూడా మప్పుతావా! నీకర్మం. అఘోరించు. నీకుచదువురాదు. దిక్కుమాలినపుట్టుక నాది. జాలిపుట్టుక. నిన్ను కొట్టగా కొట్టగా నాచేతులుకూడా కాయలుకాచిపోయినవి, ఏమి చేయను.

[అంత హిరణ్యకశిపుఁడు వచ్చుచున్నాడు]

ఛండు:—దయచేయుఁడు. అబ్బాయి విద్యాకౌశల మునుఁ బరిశీలింపవచ్చితిరా? ప్రహ్లాదా! మీా నాయన గారు నీచదువును వినవచ్చినారు. నమస్కరింపుము.

ప్రహ:—బాబయ్యగారికి నమస్కారములు.

హిర:—(తనలో) ఇంతకాలమునకు బుద్ధివంతుఁడయ్యెనుకాఁబోలును. (ప్రహలాదునిఁ జూచి) నాయనా! ప్రహలాదా! నీవెన్నఁడు బుద్ధివంతుఁడ వగుదువో యని పుట్టెడాసతోనుంటిమి. ఇన్నాళ్లకు విద్య నభ్యసించితివా? ప్రజ్ఞావంతుఁడ వైతివా?

ప్రహ:—(నవ్వుచు) తమ దయవలన చదువు లన్నియు సులభముగానే నేర్చుకొంటిని.

చండు:—(తనలో) కొంపదీసి వీఁడు తండ్రివద్ద నారాయణపాఠము చదువఁడుగదా! ఈ రాక్షసేంద్రునకు కోపమెక్కువ నాకు కట్టనుమురాకున్నమాని. ఈయనగారి కోపమున కెక్కడ పాత్రుఁడ నగుదునో యని భయ మగుచున్నది.

హిర:—(కొడుకునుఁ జూచి)

బిలహరి—ఏకతాళము

రార నాచిన్నియన్న-రాక్షస లోకమెన్న॥ రార॥
కోరిక నాకుఁదీర-కొడుకా! కులముద్ధరింప॥ రార॥
చదువునేర్చినావె? సద్బుద్ధిగనినావె?
కుదురుగా శాస్త్రముల్-కథలు నేర్చినావె?॥ రార॥
పద్యమొకటిచదివి-పదవిభాగముఁజేసి
విద్యనేరుపుమీర-వినిపింపు మర్థమును॥ రార॥

ఏమి చెప్పిరో గురువు-లేమి నేర్చినావో
నీమహాప్రజ్ఞ నేడెఱుఁగంగ మనసాయె॥                    రార॥

నాన్నగారూ! సకలశాస్త్రములను జదివించితిరి. నాకు సకలధర్మములను నేర్పిరి. కాని నాకీ చదువులయం దేమియు రక్తి గనుపించ లేదుఁజుమండీ!

షణ్ముఖప్రియ—ఆదితాళము

ఎంతజదివినా-యెన్ని నేర్చినా తండ్రి॥                         ఎం॥
యెంతవారలైనా-దంతివరదుఁ గనఁజాలరయ్యా॥            ఎం॥
ఎందరో భ్రమఁ-జెంది మోహామునఁజిక్కి
యంధులై సంసారము*నందుగొట్టుకొనికుందువారె॥ఎం॥
భక్తి చింతలేక-భావమునందెవ్వఁడేని
యుక్తియూహాలున్న-తా*ముక్తిఁ త్రోవఁగనిపెట్టఁజాల॥డెం
మాటకారినైె-మంచియుద్యోగంబు నంది
గోటునీటులున్న*వల్లకాటికేగకను-తప్పదాయె॥ నెంత॥

హిర:—(కోపముతో) వత్సా! నీకీ పిచ్చివేదాంత మింకను విడువలేదా? నీపినతండ్రిని జంపి మనవంశమునకు పగతుఁడైన యావిష్ణుఁడు•నీకుఁ బూజింపఁదగినవాడటరా? ఎవఁడురా! నీకీదుర్బోధలచెప్పినది?

ఛండు:—(వణకుచు తనలో అన్నన్నా! వేలిమిలో పుల్లఁబెట్టినాడుగదా! ఈయనగారింక యీ కోపమంతయు

నాపైఁ జూపకమానఁడు. ఇంతటితోనైనను మాటలాడకూరకున్న బాగుండునుగదా!

ప్రహ:—జనకా! నారాయణభక్తి పూర్వపుణ్యవిశేషంబున యలవడునేగాని నేర్చుకొంద మన్ననూ రాదు. నేర్పువారంతకన్న లేరు.

హిర:—ఛీ! ఛీ! ఆ ప్రసంగమే నే నెత్తవద్దని మొదటినుండియు మొత్తుకొనుచున్నది. (కన్ను లెఱ్ఱజేసి)

బంగాళా—త్రిశ్రజాతి

విడువరా-విడువరా-వైరితలఁపౌ చక్రిపై-మతిలేనిబిడ్డ॥వి॥
కడుదుర్మతి యావిష్ణుని-కతలు చాలు మనకేటికి
కడునుడికింపకు నామతి కొడుకా! నగుబాటులు మన
సరివారిలో బడక
విడువక సాధింపనుంటి-వెదకుచుంటి-యూకొంటిని॥విడు॥
దిక్కులు సాధించితి-దశదిక్కులు శోధించితి-నా
టక్కరీఁడు-నక్కియుండె నెటనో-గుండెలు
వ్రక్కలింపనా-గాత్రము-చెక్కి వేయనా-యాతని
చిక్కనిరక్తము దాహము-గ్రుక్కలకొలదినిఁ ద్రావన॥వి॥
పగవానిని శ్లాఘించుట-బంటుతనమొ? బిడ్డా!
పగబూనుము-జగముల మన-మగతనమునకడ్డా?
తెగలకు నాయంతవాని-బిడ్డఁడవై దనుజావళి
నగరా! నగరా! యాతనిఁ-బొగడకుమిక వైరివాఁడ॥విడు॥

(చండునిఁ జూచి) బ్రాహ్మణాధమా! నోరెఱుఁగని యర్భకునకు చదువున కుమారీ చదువును బాగుగా బోధించితివా? ఏది చెప్పిన దానినే బాగు డింభకున కీకరణి విరోధి శాస్త్రమును మప్పి మా కులమునకు నగుబాటుఁ గూర్పఁ దలఁచితివా? ఇదియేనా నీ గురుత్వము. "తిన్న యింటి వాసము లెన్నినటుల" మాకు శ్రేయముంగోరఁదగినదానికి మాకు నగుబాటునుఁ గూర్పఁదలఁచితివా? చాలు చాలు నీ చదువు. నిన్నేమిచేసినను చేయవచ్చును.

చండు:—(బిత్తిమాలుచు) దేవా! నాపై నేల కోపించెదరు? సదా మీ యన్నమునే దినుచు మీ క్షేమములఁగోరువాఁడను. మీకు ఎగ్గుదలంతునా? నే నంత కృతఘ్నుఁడనుగాను. నే నేమిచేయుదు? వీని నైజమిది. పట్టినపట్టు విడువఁడు. తాఁ జెడునదేగాక తోటివిద్యార్థుల నందరిని పాడుచేయుచున్నాఁడు. భయము బొత్తిగా లేదు. రాజనందనుఁడని దండింప శంకింపుచున్నాను. తమ రనుజ్ఞ నొసంగితిరేని యీతని కొలదికాలంబులో మాతండ్రి శిక్షలకోవిదునొనరించి మీ దయకు పాత్రుఁడనుగాఁగలను. ఈతఁడింక దండనమునకుఁగాని లొంగఁడు.

హిర:—అటులైన యింకొక వత్సరము గడువొసంగితిని. బాలుని కోవిదునిఁ జేసి నన్ను మెప్పించితివా! నిన్ను కోటీశ్వరునిఁ జేసెదను. వీనికింక సామదానభేదదండోపాయంబుల విద్యఁగఱపుఁడు. (నిష్క్రమించుచున్నాఁడు)



## సప్తమరంగము



[ప్రవేశము—బడిపిల్లలతో ప్రహ్లాదుఁడు]

శంకరాభరణము—త్రిశజాతి (డ్యాన్సుమాదిరి)

పామా గరిగా పామా గరిగా దాపమా గరిగామా

పూలూ మల్లె పూలూ జాజిపూలుఁ గోయుదమా

సారి-సాని-దానిదసా-దానిసారీసనిసా-గమ॥ పామా॥

శాలి-మీర-శ్రీహరిపై॥పాటఁ బాడుదమా-మంచి॥ పూలూ॥

భక్తజనుల-తోడఁగూడి-భజన చేతమా?

ముక్తినిధానునికతలను-ముచ్చటింతమా?

పాపపప-మాపామపదా పామా-గామా-గమపామాగా-

రీగా రిగమాగారి

శక్తికొలది-దాల సఖత్వమూ-జేయర మది-లోనఁ దల

సారీ సరిగారీసా-దనిసాగమ॥ పామ॥

పూనర మే-లగుఁగానర॥ పూలు॥

మేలుగ పర-మాత్మఁగొల్వ-జాలముతగదు-యీ

తోలుబొమ్మ-లకు మరేది-త్రోవగుపడదు

కాలము జరు-గకమానదు-గానఁ మన-సారఁ భక్తి మీరఁ

ధరలోనఁ-మంచి॥ పూలు॥

గాలవుడు:—ప్రహ్లాదా! అయ్యవారు నిన్ను చితకబాదుచున్ననూ నీకు మతి మారదేమి? నీవు ప్రతి

దిన మింత భక్తితో నున్నందుకు నీకా శ్రీహరి యేమి చ్చినాడు?

ప్రహ:—మూఢుడా! ప్రతిఫలముకొఱకని హరిని సేవింపరాదు. మూఢుము జ్ఞానములేని వృథాదు లెన్ని ప్రతిఫలములఁ గోరక యే మన కాధారమగుచున్నవో!

గాల:—నా కవన్ని తలకెక్కవయ్యా! నేనే నిత్య ము భగవంతుని సేవఁ జేయుచుందునను కో! భగవంతుడు నా కేమిచ్చును?

ప్రహ:—ఏమిచ్చుహా? సంకటములనిచ్చును.

గాల:—సరిసరి లే! అదేనా భగవంతుఁడు చేయు లాభము.

ప్రహ:—అంతే కాదు. విశేషించి దరిద్రముకూడా యీయవచ్చును.

గాల:—చాలు చాలు. అటులైన యింకెందుకు? మనకీపాట్లు.

ప్రహ:—అటుపైని శాశ్వతానందంబుల నొసంగు తన దివ్యసాన్నిధ్యమే యొసంగును. మన కంతకన్న గావలసిన లాభ మింకేది?

బ్యాగు—ఏక తాళము

ఆనందమే-బ్రహ్మానందమే-నిత్యానందమే-హరిసాన్ని ధ్యమే-భళీ॥ ఆనం॥

ఆనందమయుని-ర-మానందుదర్శన
మేమందు బుధుల క-దేవిందురా-ముందు॥ ఆనం॥

తనువులు ధనములు-దారాసుతాదులు
వెనురారురా-ముందు-గనరారురా మన॥ కానం॥

ధాటిగా యముని చే-పోటులఁదినకుండ
సూటిగా పై మెట్టుఁ దాటించుటకు మేటి॥ ఆనం॥

అధమజన్మములె త్తి-యనుభవించుటకన్న
కుమరుగ నొకచోటఁ గూర్చుండిబొందించు॥ యానం॥

వసం:—రాజనందనా! నీబోధ లెంతవిన్నను తనివి తీరదుగదా! నీవింత దివ్యజ్ఞాన మెచ్చట నేర్చుకొంటివి?

ప్రహ:—తొల్లి మా తండ్రి మందరాద్రికి తపంబునకరిగిన సమయంబున దేవేంద్రుఁడు రాక్షసశత్రుత్వంబునకు వెరచి మా యమ్మను చెరఁగొన్న సంగతి లోకమెరిగినదేగదా? అట్టితరి నారదుండు మా యమ్మను విడిపించి, గర్భస్థుండనగు నాకు దివ్యజ్ఞానబోధనము నొనరించెను. ఇది పరమరహస్యము.

శంబ:—అటులైన నారదుఁడు రాక్షసులదుంపఁ ద్రెంపుటకే నీకీజ్ఞానోపదేశ మొనరించినది. ఇంకనూ మోక్ష మార్గమును గురించి చక్కగా తెల్పుము. మన యయ్యవా రెన్నడూ యిట్టి చదువులను నేర్పరుగదా!

ప్రహ:—అయ్యవారు కడుపుకక్కూర్తికైరెండు కల్లబొల్లి చదువులు నేర్పుచున్నారేగాని దూరాలోచనకుబోరు "తన్నెరుఁగువారె తత్త్వవిదులు" అని పెద్దలు చెప్పియున్నారు. ఈప్రసంగములు తత్త్వార్థము తెలుసుకొనఁగోరు మహాత్ములకే గాని తదితరులకు రుచింపవు.

వసం:—ప్రహ్లాదా! నన్నొక సందియము చాల దినములనుండి పీడించుచున్నదయ్యా! ప్రాణులందరు భగవంతునిచే నొకేతీరుగా సృష్టింపఁబడుచున్నారుగదా! అట్టివారిలో కొందరు సన్మార్గముననూ, కొందరు దుర్మార్గముననూ యిహమున ప్రవర్తించి పరమున నందుకుఁదగిన పాపపుణ్యముల ననుభవించుచుందురని పెద్దలు చెప్పుట కలదు. భగవంతునిచే నాడింపఁబడుచున్న యీ కీలుబొమ్మలకు మరల కర్మముఁ జుట్టబెట్టనేల? సర్వము జేయించుచున్నవాడు పరమాత్మఁడేగదా!

ప్రహ:—దానిని బాగుగా వివరించెద వినుఁడు. ఒక గురువు పెక్కు శిష్యులకు కొంతకాలము కేవిద్యనుఁ గఱపి వారిని స్వాతంత్ర్యజీవనమునకై విడుచుచున్నాడు. విద్య నేర్చినవారిలో కొందరు శిష్యులు జ్ఞానాభివృద్ధిఁ జేసుకొని గురువు నేర్పిన విద్యను బాగుగా ప్రకటించి ప్రజలకును గురువునకును సంతోషమునుఁ గూర్చుచున్నారు. మరి కొందరు మందమతులై గురువు నేర్పినదానిని కూడ మరచి

నోటికివచ్చినట్లెల్ల ప్రేలి ప్రజలచేతను గురున్నచేతను నిర సింపబడుచుండుట లేదా? అదేవిధమున సర్వేశ్వరుఁడు ప్రాణులకు ప్రపంచమున ప్రవర్తింపవలసినరీతులనెల్ల నేర్పి వీరి యోగ్యతలను పరిశీలింప తానంటియు నంటక ఆత్మలకు పరమాత్మయై మాయాతెరచే కప్పఁబడిన కర్మభూమియనఁబడు కత్తులబోనువంటి యీ ప్రపంచరంగమున విడుచుచున్నాఁడు. ఈ ప్రాణులెక్కడ కొందరు భగవంతుఁడు నేర్పిన పాపపుణ్యములను ధర్మాధర్మములను మరచి వారి స్వేచ్ఛానుసరణి వర్తించి యిచ్చట జనులచేత నిందింపఁబడి యచ్చట యంత్యమున భగవంతునిచే శిక్షింపబడుచుందురు. కొందరు భగవంతుని యాజ్ఞను మరువక పాపభయంబులను వెరచుచు సన్మార్గమునవర్తించి లోకులచేత మెప్పొంది, సర్వేశ్వరునిచే పైస్థానమున కంపఁబడుచుందురు. ఇంక తెలిసినదా?

వసం:—ఆ. పూర్తిగా సందియనివారణమైనది. ఇంక మన యుపాధ్యాయుఁడు బడికి వచ్చువేళ యైనది. ఈ లోపున నొకమాఱు భజనఁ జేసుకొనవలదా?

శంబ:—అవును. హరిని సేవింప జాలము పనికి రాదని నీవే తరచు చెప్పుచుందువుగదా!

ప్రహ:—కాదా! లోకంబున నజ్ఞానులు పల్వురు యిహసుఖంబులమరగి యెన్నఁడో తీరికగానున్న సమయమున భగవంతు నారాధించుకొందమని భావించియు బాల్యావస్థ

లాగను ఆటలతోడను, యౌవనావస్థయందు కాంతా వైభవంబులతోడను, వార్ధకంబున రోగాది బలహీనముల తోడను వెఱ్ఱికుక్కలవలె వర్తించి తుదకు హరిస్మరణకవ కాశమే చిక్కక యెప్పుడో గుభాలున దీపమారి యధోగతికి ప్రాప్తులగుచుందురు. కాన భక్తివిషయములో జాలము తగదు. నేనొక కీర్తనఁ బాడెద మీరందరు నా వెనుకఁ బాడుఁడు.

కమాచి—త్రిశ్రజాతి

భద్రమైన పదవిఁ జూపరా—వైకుంఠధామ॥ భద్ర॥
కద్రూసుతాధిపశయనా! కష్టములోర్వలేర॥ భద్ర॥
ఎందరెందరో మమతలఁ జెంది మోహమునఁ జిక్కి
అంధకారకూపమందు—ద్రిమ్మరుటఁగన వెరపుగల్గె
రా—పరా—త్పరా! బిరాన నాకు॥ భద్ర॥
తల్లికడుపునందు బుట్టి—దారుణకర్మ లొడిఁగట్టి
చల్లగాను ద్రెళ్ళి మరల—జన్మము లిల నెత్తఁ జాల
రా—మురా—సురా—హరా! బిరాన॥ భద్ర॥
అసురకాననాగ్నిహోత్ర—అమరులలోఁ గలసి హాయి
విసుగెరుగక నీదుసేవ—వేడుక నొనరింపఁ జేయు
రా—ధరా—ధరా—ధరా! బిరాన॥ భద్ర॥

[అంత చండుఁడు కేకలు వేయుచు ప్రవేశించి]

చండుడు:—శుంఠలారా! మరల ప్రారంభించినారా? అబ్బబ్బా! ఎన్నిమారులు వద్దించినను మీకు బుద్ధి లేదే

మర్రా! ఉస్.. నా ప్రాణాలకు యమకింకరులై నాకెక్కడ దాపురించినారురా మిమ్ము తగలబెట్ట! పాఠాల ఘోరించండని తల మొత్తుక చెప్పి నేను భోజనానికేడిస్తే మీరేడిచేషేడుపిదిమూ? అమ్మయ్యా! ప్రాణాలుడికించేస్తున్నారురా! ఎన్ని పర్యాయములు నరుసపట్టినా మడ్డిపశువుల లాగు దులుపుకుంటుంటే నేనేమిచేయను?

ప్రహ్లా:—గురువుగారూ! మేము వ్యర్థమైన పనులేమీ చేయడంలేదుగదా! మమ్మేలకోపించెదరు?

ఛండు:—ఇది వ్యర్థముగాదా! హరీ! నారాయణా! అనుకుంటూ పిచ్చియెత్తినవారివలె ప్రేలాపనా, గంతులూ వేస్తుంటే మీకేమిలాభంవస్తుంది? భ్రష్టులైపోతారురా! మీరు తప్పకుండా!

వసం:—పంతులుగారూ! మీరు మమ్ము చంపివేసినా సరేగాని యీపనిమాత్రం మానలేమండీ! మీరేమిచేసినాచేయండి. ఇది మానుమని బోధించకండి.

శంబ:—ఏమండోయ్! నన్ను నరికి ముక్కలు గోసినా సరేగాని ప్రహ్లాదుని జత మానలేనండి! మీరు చెప్పేపాఠాలు నాతల కెక్కడంలేదండీ! ప్రహ్లాదుడు చెప్పే మాటలన్నీ మాకు ముందుకు మాటలే. అలాంటి చదువు మీరు చెప్పలేరండీ! మాయింటివద్ద జీతాలు బుచ్చు

కుంటూ వూరుకోండి. మమ్మేమీయనకండి. మీసొమ్మేమి బోయిందండీ!

చండు:—ఓరి చచ్చువెధవల్లారా! నాకే యెదురు దిరిగినారురా! ప్రహ్లాదా! ఎన్నిపర్యాయములు చెప్పినా నీవు చెవునదేగాక తోటిపిల్లలనుకూడ పాడుచేయుచున్నావు సుమా! నారాయణద్వేషి యగు మీ బాబయ్యగారి కిది తెలిసిన నిన్ను తప్పక శిక్షింతురు. జాగ్రత్త!

గాల:—పంతులుగారండీ! మీ కేమండీ! సుఖంగా కూర్చోండీ. మా వాళ్ళవల్ల వచ్చేది రాబట్టుకోండి. నేను మాత్రం ప్రహ్లాదుడు నేర్పేది నేర్చుకుంటానండి. అంతే గాని మీ చదువు నాకువద్దండి. పండ్లూడిపోయిన మీ బోసి నోటి తోసిమాటలు మాకు సరిగా తెలియవండీ! మాతో యెందుకు శ్రమపడతారండీ! మీరు కొట్టిన దెబ్బలకూ, పిక్కపాశాలకూ నాదేహమంతా కాయకాచిందండీ! ఇంక మీకు శ్రమయేగాని నాకు లక్ష్యంలేదండి. ఏదో యీలాగు పోనివ్వండి. (బతిమాలుచున్నాడు)

చండు:—(తనలో) ఈ దెబ్బలకు వీని బోధలు పూర్తిగా తల కెక్కినవి. ఈ యల్లరిముండాకొడుకులకు అదేపదముగా చెప్పుచుంటినా! అందరూ యేకమై నాపని పట్టినా పట్టగలరు. ఇంక లాభములేదు. బడినుండి ప్రహ్లాదుని తప్పించితినా? తక్కిన బాలురు చక్కగా చదువు

కొందును. (ప్రకాశముగా) ప్రహ్లాదా! నీతో నేనింక ప్రేగలేను. నీకింక చెప్పుట నాతరముగాదు. నిన్ను నీతండ్రికి కప్పగించెదను. అప్పటనైనా విష్ణుభక్తిమాని మీతండ్రికి సంతోషము గల్గేలాగున చక్కనిముక్కలు రెండు చెప్పి మా బహుమతి మాకిప్పించు. నీకు పుణ్యము. రేపటినుండి నీయిష్టమువచ్చినట్లు నుసలుకోవచ్చును. నేడు మంచిది కూడను. రా! రా! నిన్ను ఆస్థానమునకుఁ గొనిపోయెదను.

( ప్రహ్లాదునిఁ దీసుకపోవుచున్నాడు )

## అష్టమాంకము

### హిరణ్యకశిపుని సభాభవనము



(సింహాసనాసీనుఁడైన హిరణ్యకశిపునకు సేవలు జేయుచు దేవేంద్రుఁడు, యమధర్మరాజు, అలకూబరుఁడు, నముచి మొదలగువారు కనిపింతురు]

హిర:—భృత్యులారా! నేడు నాగలోకమును జయించి నాగాంగనలనుఁ గొనివచ్చితిని. అది యేమిపిరికి లోకమో! ఒక్కడైనఁ గిక్కురు మన డాయెనుకదా!

నముచి:—దేవా! మనదెబ్బ యన్న లోకము లన్ని యూ బొబ్బయే. మీముందు నోరెత్తువాడెవ్వఁడు? నోరు

విప్పిన నోటిమీద తన్నుటకు సిద్ధముగా మీవెంట భటుల
మగు మేముందుముగదా! తమరు నేడు కొంచెము ప్రయా
ణాయాసము నొందినటులఁ గనుపడుచున్నారు. విశ్రమిం
పుఁడు స్వేచ్ఛగా!

హిర:—అట్లే చేసెదను. ఓగీ దేవేంద్రా! నేను
పరుండి లేచుసరికి నీవేశ్యలగు రంభాదుల నాపజ్జ నృత్య
గానంబుల నొనరింప సిద్ధముఁజేయుము. ఓ యముఁడా!
వింజామరచే నాకు నిదురపట్టునంతవరకు చల్లగా విసరుము.
ఓ అలకూబరా! ప్రక్కఁ బఱుపుము.

అల:—చిత్తము (ప్రక్కఁ బఱుచుచున్నాఁడు)

హిర:—(శయనించి) అలకూబరా! మీతండ్రి కుబే
రుఁడు నేడాస్థానమున జాడ లేడేమి?

అల:—స్వామీ! ఉదయమే వచ్చినారండీ. మీరు
నాగలోకమున కేగినందున మధ్యాహ్నమువరకిచ్చటఁ
గాచియుండి, తనకేదియో కొలఁదిపని యున్నందున నన్నిం
దుండ నియమించి వెళ్లినారండి. తిరిగి వెంటనే వచ్చెదనని
చెప్పినారు.

నముచి:—ఎవరియాజ్ఞమీద వెళ్లినాడు. మీతం
డ్రికి కొంచెము గర్వమబ్బినదేమో జాగ్రత్తయని చెప్పుము
ప్రభువుగారు లేవపుడు మంత్రులయాజ్ఞనుఁ గొనవలదా?
తనకుఁదోచినటుల చేయడమేనా?

హిరః:—నిజము. నిజము. ఈ తప్పుక్షమించితిని. ఉదయమగుసరికి యాస్థానమునకు రమ్మని చెప్పుము.

అల:—చిత్తము (పోబోవుచున్నాడు)

నము:—(కన్ను లెఱ్ఱ జేసి) ఓరీ! ఎక్కడికోతొందర?

అల:—ఉదయమగుసరికి యాస్థానమునకు వచ్చు లాగున మాయయ్యకుఁ జెప్పుమనిరిగాదా ప్రభువుగారు?

నము:—వెళ్ళవచ్చునులే! తొందరలేదు. ఇంచుక ప్రభువుగారికిపాదములొత్తి ఆయనకృపకుపాత్రుఁడవుగమ్ము.

అల:—(తనలో) మా యుసురుతగిలి వీళ్ళెప్పుడు పోతారోయి దైవమా! (పాదము లొత్తుచున్నాడు)

నము:—దండధరా! చురుకుగా పనిచేయుము. ప్రభువుగారికి హాయిగా నిద్రపట్టవలయును. ఆయనకు నీపై దయఁగల్గినలెను.

యముడు:—(విసరుచు) ఈగాలి విషగాలియై యీ శనిగాళ్లనెన్నడు విసురుకు పోతుందోగదా!

(విసురుచున్నాడు)

నముచి:—దేవేంద్రా! నీ వేమి చేయుచున్నావు. నీగొప్ప యేమి యేడ్చినది? యముని జూచితివా! ఏమి చేయుచున్నాడో? నీవుకూడా యా వింజామరనుఁ బట్టు కొని రెండవప్రక్క నిల్వుము.

దేవేం:—(తనలో) ఏమిచేయగలను? ఔరా! కాల మాహిమ. (విసరుచు)

కాంభోజి—త్రిశజాతి

ఎంతభోగమో-యీ హంతకులకు యీదినముల॥ నెం॥
సుంతయేని కరుణరాదె? చూడవె మావంక విధీ॥యెం॥
నాకలోకమేలినట్టి-పాకారికి బానిసపని
యీకరణిని లిఖియించితివే? విధి నీమతి యేమిది॥యెం॥
న్యాయమూ ఁదియగు యమునకు-వేయుట వీవనయా?
మాయురె! ఇదియాధర్మము-మాపాపము లివియా?
మాయభాగ్యమున వరముల-నీయసురుఁడు కోరినట్లు
లీయుటచేగాదె మా-కీయిడుముల గల్గుచుండె॥ నెం॥

గడ్డిపరక జేయని యొక యసురనిర్భాగ్యునకు మాచే దాస్యము లేల జేయింపుచున్నావురా విధాతా! నీ తెలివి యేమూల బుగ్గియైనది? వేల్పు పెద్దయని పెద్దపేరుఁ బెట్టుకొన్నందుకు నీవేల్పుల కీపాట్లుగల్గ నీకు నగుబాటుగాదా! సుంతయు యోచింపక యీదురాత్మున కీ యసాధ్యవరము లేల యొసంగితివి? ఇచ్చినవాడవు చేయి మూర్చుకున్నట్లు కంగారుపడక కృకలాన పేనువలె సత్యలోకమునం జతికిల బడితివేల? నీ బ్రతుకు నీవు జూచుకొనుచున్నావా! ఇది యేనా నీ లోకనాయకత్వము. మాయందరి యుసురుల నీయసురునకు బోసి హాయిగా జూచుచున్నావా?

నముచి:—(కోపముతో దేవేంద్రుని జూచి) పాక శాసనా! అదుగో! ప్రభువుగారు కదలుచున్నారు. పాతిన కొయ్యవలె నిలిచి యోచించుచున్నా వేమిటి? ఇంత యజాగ్రత యేమిటి? చురుకుగా పనిచేయలేవా? ప్రభువు గారితో చెప్పి నీకు కొంచెము వడ్డన చేయించవలెనా?

దేవేం:—అయ్యా! నాపై నేలకోపించెదవు? పని యలవాటు లేక మధ్య మధ్య నాగుచున్నానుగాని ప్రభువు గారికి సేవజేవ నిష్ఠ లేక కాదు.

నము:—అలవాటు చేసుకొనవలయునుగాని యెల్ల కాల మొక్కటేటిరా! చేతగాదంటే సాగుతుందా! దున్నపోతువలె తిని సుఖముమరిగి గద్దెపై నెక్కి తైతక్కలాడుట యనుకొంటివి కాబోలును. కొంచెము కీళ్ళు వంచి పని జేయుము. యమధర్మరాజా! ఆపీఠమునుగొనివచ్చి నాకు కూడ వేయుము. నేనుకూడా చక్రవర్తిగారితో నేగి మిగుల శ్రమనొందియుంటిని. ఇంచుక విశ్రమించెదను.

యము:—(తనలో) ఈదురాత్ముడు నన్ను తనకు కూడ కాళ్ళు బట్టుమనడుగదా! చేయమన్న తప్పదు. రాక్షసరాజు వీనిచేతిలోని కీలుబొమ్మ. ఏమి చేయించినను చేయింపగలడు. (పీఠమువైచి) వీడి వైభవముగాల. ఈ శనిగాడు మోక్షమెప్పుడుగంటిపోతాడో!

నము:—(అశీనుడై) ఆ విసనతో నాకు కూడా కొంచెము విసురులు దగులనిమ్ము. నాకునూ నిద్రవచ్చుచున్నది.

యము:—(తనలో) కాలమా! ఎంతదానవే!

(విసురుచున్నాడు)

హిర:—దద్దరిల్లి లేచి ఓరీ దేవేంద్రా! ఓరీ యమా! పట్టుకొనుడు. పట్టుకొనుడు. అట్లు చూచెదరేలరా! నముచీ! లెమ్ము. లెమ్ము. (కేకలువైచుచున్నాడు)

దేవేం:—స్వామీ! మీ సేవనే జేయుచున్నాము గదా! కేకలు వైచెదరేల?

హిర:—(లేచి) మీ సేవగాల. ఆ భయంకర సింహము నాపై బడజూచుచున్నది. అడ్డుకొనరేమి? దానిని దెగటార్చరేమి?

నము:—(చటాలున లేచిపట్టుకొని) స్వామీ! కలవరించెదరేల? ఇచట సింహమేది? స్వప్నము కాబోలును.

హిర:—(సదాసించిచూచి) ఔరా! కలగంటినా? నముచీ! పెద్ద సింగమొకటి నన్నుఁ దరుముకొనివచ్చినట్లయినదిరా! నిజముగా జరుగుచున్నదనుకొంటినిగదా! ఇంక నిద్రచెడినది. ఇపుడేటుల కాలక్షేపము?

ఛండు:—(ప్రవేశించి రాజునకు నమస్కరించి) స్వామీ! అమ్మగారు అబ్బాయిగారితో నేతెంచుచున్నారు. లోనికిరా సెలవా?

నము:—(దేవేంద్రాదులను జూచి) అమ్మగా రేతెంచుచున్నారట మీ రందరుబోండు. ఉ॥ మేమే హాజరు గండు.

అందఱు:—చిత్తము. (నమస్కరించిచనుచున్నారు)

[అంత లీలావతి ప్రహ్లాదునిఁ దీసుకొనివచ్చును]

హిర:—(ఛండునిఁ జూచి) మా ప్రహ్లాదుఁడు సకలవిద్యావిశారదుం డాయెనా?

ఛండు:—చదువవలసిన గ్రంథములన్నియు పూర్తి యైనవి. చెప్పుటకింక మావద్ద విద్య లేదు.

హిర:—(సంతోషముతో) భేషు భేషు. పుత్రా! ఇటురమ్ము. నా మోడి నలంకరింపుము. (ఎత్తుకొని ముద్దాడి) చెలీ! బాలుని ముద్దుపల్కుల నాలకింప బుద్ధిగలైనా? అవును. పుత్రుఁడు కోవిదుఁడైనపు డెవరకిసంతసముగాదు!

లీలా:—(కొడుకు ముంగురులు సవరించుచు) చిట్టీ! పెక్కునాళ్ళనుండి యెన్నఁడువిందుమా యని పుట్టెడాసతో నున్న మా వీనులకు విందుగా రెండు చిల్కపల్కులనుఁ బల్కుము.

ప్రహ:— బిలహరి—త్రిశ్రజాతి

అలకింపుమా! తండ్రి వైనఁగాని సేఁదెల్పెద॥ నాల॥

చాలకాలమభ్యసించి-సారముగ్రహించినపలు॥ కాల॥

శ్రీలాయస్థిరములు-దే-హాలా శాశ్వతముగావు

యేలా? ఇహసుఖముమనకు-మేలా? మేలా? దనుజ పాల॥ అ॥

హరినిఁ బొగడని నాలుక-గిద్ద రుపిన్నవె వీనులు
కరినుతుఁగన్నవె కన్నులు-సిరివరుఁదెల్పునదె చదువు॥ఆల॥
పాపములను మాపఁగ హరి-భక్తులఁ దరిఁజేర్పఁగ హరి
కోపుల దండింపఁగ హరి-చూపులకందని శ్రీహరి॥ నాల॥

చండు:—(భయముతో) నాకింక లాభము లేదు. వీడు వెనుకటిగుణమును విడువలేదు. ఈ రక్షోనాయకుని యలుక రేగకమున్నె చల్లగా యావలికి జారవలయును. (ప్రహ్లాదునిఁజూచి) కొంటెవాడా! నీకిది యొక పంతమా? మేము నేర్పినవిద్య నంతయూ యేమూలబారవైచితివి? నీకిది యేమిబుద్ధి. ఛీ ఛీ! ఇంక నీ మొగము చూడరాదు. (మెల్లగా జరుగుచున్నాడు)

హిర:—(నిట్టూర్పువిడిచి) ఔరా! ఇంకేమిచేయను. కులమున కప్రతిష్ఠ గలిగించు దురాత్ముఁడువీడు. ఎన్నిమారులు చెప్పినను తన నైజము విడువకున్నాఁడు. గురువులు మాత్ర మేమిచేయఁగలరు. ఈ తులువ నాకు పుత్రుఁడు గాఁడు. శత్రుఁడు. వీనినింక యూరకున్న లాభము లేదు. (పండ్లుగొరుకుచు కొడుకునుఁజూచి) అధముఁడా? చందనవనమున ముండ్లమొక్క జనించినటులఁ బుట్టితివేమిరా! వద్దన్నపని మానవుగా నీవు. యా శ్రీహరి నీకు రక్షకుఁడటరా పశువా! తగిన ప్రాయశ్చిత్తము ననుభవింపుము. (ఒరనుండి విసరివేసి కత్తినిఁదూసి)

ఖరజా—ఏకతాళము

మానవా? హరియున్న-మాట డింభకా! చూడు॥ మాన॥
వారి-నేల-నాకు-ప్రేమాల-చాల-పెద్ద-జేసె-దీవ్ర॥ మా॥
చూపు-పీదిక్కులు మెవ్వాడు-యడ్డైనఁగానిపీడు
వాడనుగాను నేడు-నా తాడనంబు-జూడు-మిక జూడు
రా లేడు-యా చక్రిగాడు (పడవైచి తన్నుచున్నాడు) మా॥

లీలా:-తాళుఁ డిది మేటియల్ల- పాలు-గారెడు ముద్దు
బాలు-డితఁడే మొగుండు-చాలు-చాలు-చాలు-చాలు
(అడ్డుకొనుచున్నది)

హిర:-అడ్డురాకు మీ తులువను-అడ్డముగా దెగనరికెద

లీలా:-బిడ్డల సైరింపకుంట దొడ్డతనమా

హిర:-యింతగడ్డుతనమా? గడ్డిబలపె జేయుని పగవానిగొప్ప
నాకుఁ జెప్ప-బిడ్డనిక్షమియించు కొల-నడ్డివిరిచి పారవైతు॥

లీలా:—(మగని చేతి ఖడ్గముఁబట్టుకొని బ్రతిమాలుచు)
జీవితేశ్వరా! నా మొగమైనను చూడరా! ఈ యర్భకుని
నేరము సైరింపరా?

బేహాగ్—ఏకతాళము

నాప్రాణపథమా! నాపాలిధనమా
నామనోహరా-నామాట వినవా॥ నాప్రా॥
నోరెరుఁగని బిడ్డఁడు యొనరించిన-నేరముగాచుట
తగదే-అయ్యా! తగదే-కరుణఁగొనదే-మనసు
కూరిమిబిడ్డను విడు విడు విడు విడు॥ నాప్రా॥

కరములు మోగిచెద-కాంతమనవివిను-కఠుగదేమిసే
తురా మతి-వరబల విజితధరామండల హా! వలదు
వలదు-చలముడుగుము-బాలుఁడు॥ నాప్రా॥

(కొడుకును బ్రతిమాలుచు) పుత్రా! నీకిది యేమి పంతము. మీ బాబయ్యగారి కలుకఁదెప్పించెద వేల? వద్దన్నపని మాన వేమి? మీ తండ్రిగారు నిన్ను దండింతురు సుమా! కడుపారఁగన్న నేను నీ కష్టములు చూడఁ లేను. నాచిట్టి! నేను చెప్పినట్లు చేయవా?

బేహాగ్ — చతురస్ర

లీలా:--వినవా జనకుని పలుకులు నాతండ్రి॥ విన॥
కనుకఁబూనునికఁ గొనఁడు కరుణమది॥ .. విన॥
పహ:-అమ్మా! శ్రీహరి భజనముమరువనె॥ అమ్మా॥
ఇమ్మహీనాపద లెన్నియొగల్గిన॥ అమ్మా॥
లీలా:-విడువుము వాదము-విష్ణునిధ్యానము
కడుబ్రతిమాలెద-గాదిలినందన!
* దుడుకు నిజనకుఁ డుడికియాలుకఁగొను
పడుమా పదములఁ బ్రార్థింపన్
కడుశ్రమలనుఁబడి నిన్నుగంటిరా
కంట నీకష్టములఁ గనఁజాలర॥ వినరా॥
ప్రహ:-మరువఁగఁజాల-హారినిసుమంతయు
వెరవకుమమ్మా నా-దురుసగు వెతలకు

* తిరముగాని సుఖదుఃఖము లివిగద
జరుగుచుండు పూర్వజన్మకృతమున
కరివరదుఁడు లేడే? నా పాలిట
కన్నతల్లి! కడుపుపగుల నేడ్వకు॥ అమ్మా॥

హిర:--ఔరా! పాపి యింత కావరమా? యాహరిపాదము
మానవుగా॥ ఔరా॥

పొగరడఁచెద నిలునిలుమిక * చించెదగాత్రము
ద్రుంచెద నినుఁ గాల్పించెద పొడిఁజేయించెదఁ
జూడుము॥ ఔరా॥

(పడవైచి మోదుచున్నాడు)

లీలా:—(ఏడ్చుచు) హా జీవితేశ్వరా! ఇది యేమి మహాత్మ్యము. కన్నబిడ్డఁడుగాఁడా? మీ కరములింత కఠినత్వమునకుఁ బాలుపడుచున్నవేమి? తెలియక చేసిన చిరుతని నేరమునకే దండించు జనకుఁ డెందైనఁ గలఁడా? అయ్యయ్యో! ఎక్కడనైన నున్నదా? ఇంత విరుద్ధము. నా మొరనైన యాలకింపరేమి?

హిర:—(కోపముతో) కాంతా! ఈ తుచ్ఛుఁడు నాకు తనయుఁడుగాఁడు. జనకద్రోహి. తండ్రిపై వైరమూనిన తనయుఁడెందుఁగలఁడు? ఈ క్రూరుని మొగము చూడరాదు. వీనినింక క్షమింపఁబనిలేదు. వీని యంతము చూడక మానను. నీ వేడ్చిననూ, మొత్తుకున్ననూ, లాభము లేదు.

ఈ దరిద్రుఁడు పుట్టిననాడే చచ్చినాడనుకొనుము. ఆస వదలుకొనుము. (కింకరునిఁజూచి) నముచీ! దిట్టమగు గద లను యాయుధంబులనుఁ గొనిరమ్మని శకునికిఁజెప్పుము.

నము:—చిత్రము. (ప్రహ్లాదునిఁజూచి) వెర్రిపిల్ల గాఁడా! మీ నాయనగారికి కోపము హెచ్చినప్పుడైనా పంకమువిడువవేమి? ఇంక నీ జాతరఁజేయించును. ఇప్పు డైనా బుద్ధిఁదెచ్చుకోరాదూ—దుడ్డుగర్రఁ దీసుకొనివచ్చె దనుసుమా!

ప్రహ:—(నవ్వుచు) చాదస్తుఁడా! విష్ణుని యాజ్ఞలే నిది నీవేమిచేయఁగలవయ్యా! నాకు భయములేదు. గద్ద రింపక నీపనిఁ జూచుకొనుము.

నము:—ఈ కుర్రఁడు పోటులతోగాని మాటలతో మెత్తఁబడువాఁడుగాఁడు. (పోవుచున్నాఁడు)

ప్రహ:— బారువా—ఏకతాళము

సమయమయ్యా-లేచిరావయ్యా
అభయమియ్యా-నా బాబయ్యా-అయ్యా॥ సమ॥
ఇభవరదా! నీవేదిక్కని నిన్నేనమ్మికొంటిరా
దరిఁజేర్తువనియుంటిరా-భయహరుఁడవని వింటిరా
శరణంటిరా-వగఁగొంటిరా-అయ్యా॥ సమ॥
లచ్చితోఁ పాల్కడలిని సరసములాడుచున్నావో-లేక
పచ్చవిల్తుముద్దులనుఁ బల్కించుచున్నావో-స్వామీ!

ఎచ్చటనున్నావో-నీ-వేమితలఁచినావో-బల్
మచ్చికతో రావో-మనసిచ్చిబ్రోవ లేవో-అయ్యా॥ సమ॥
మందాకినీపాదా! తాపసబృందావనా వాదా? కను
పడ వెందుకు దయ రాదా? కనులకు విందుఁజేయ రాదా?
మును నీ-వెందరిని నేల లేదో-నిన్ను నేమందునయ్యా
జాలిరాదో-భక్తులో లుఁడందురది నిల్ప రాదో
మనసు లేదో-చేతగాదో-రారావో॥ సమ॥

లీలా:—(తనలో) అకటా! ఇపు డేమి చేయుదానను. నా భర్తగారి కోపమునకు హద్దుండదు. భక్తిపారవశ్యం బుననున్న యీ బిడ్డ శ్రీహరి ధ్యానము విడువఁడు. కఠిన కింకరులు రాజాజ్ఞానుసరణిని యీ సుకుమారుని దండింపక మానరు. హా! ఈ దుఃఖజలధి నే నీదఁజాలను. ఓయీ! పరాత్పరా! పుట్టినదాది నిన్నే నమ్మియున్న నా బిడ్డకు యిడుములఁ గలిగించుట నీకు భావ్యమేనా? నీవు మహిమ గలస్వామి వే యైన నా నాథునిమతి మార్చ లేవా? నిప్పు వంటి యలుకను నీరుఁజేయ లేవా? ఆ దుడుకుదనుజులు చేయు యలజడికి నా తనయుఁ డోర్వగలఁడా? (నగని కాళ్లపైఁబడి) కట్టా! జీవితేశ్వరా! నా ప్రార్థనమంగీకరింపరా?

సీ॥ ఉపవాసవ్రతముల్ల । నోవ్వగా నోనర్చించి
కనుపార్వ గన్నట్టి । కొడుకుగాడ?

పర్యంకమున ముద్దు । పల్కులు నీపజ్జ
కడురక్తి నేర్చిన । బుడుతగాఁడ?
అడ్డాల గిలిగింతలకు । కిలకిల నవ్వి
నీకు మోదముఁ గూర్చు । నిసువుగాఁడ?
అంకంబునను జేర్చి । యలిబాళి చెక్కుళుల్
బట్టి ముద్దాడిన । పట్టిగాఁడ?
ఆ॥ వె॥ ఇంత ఘోరకృత్య । మొందేని గలదొకో
అకట! బిడ్డఁ డేమి । హానిఁ జేసె
మదినిఁ బుట్టు కోప । మంతయు సుతునిపైఁ
జూపు జనకుఁ డున్నె । క్షోణిలోన॥

[అంత నముచి, శకుని మొదలగు భటులు ఆయుధములతో వత్తురు]

హిర:—(భార్యనుఁ జూచి) లాభములేదిక నేడ్వకుము. ఈదుష్టునిపట్లఁ గనికరముఁ గొనరాదు. నీవు మాటలాడిన దండింపఁబడుదువు. (కొడుకునుఁ జూచి) ఓరీ డింభకా! శాత్రవపక్షపాతీ! ఇకనైనను మా హరిస్మరణ మానుదువా? లేదా? అదుగో! కింకరులనుఁ జూడుము. నిన్ను చావఁగొట్టించెదను. నీడొక్కఁ జీరించెదనుజుమా!

ప్రహ:—(నవ్వుచు) నాయనగారూ! మీ కీకోపమేమిటికి? తమకింత దైవద్వేషము తగునా? అహహా! ఎంత విచారకరము.

హిర:—(గద్దరింపుచు లేచి) దైవద్వేషమా? దైవమెవఁడురా! సకలజీవరాసులకు నేనే దేవుఁడనై యుండ మరి యొక దేవుఁడు గలఁడా?

ప్రహ:— మొదటనే కొట్టవచ్చిన నేనేమనఁగలను.

కమాచి—త్రిశజాతి

అయ్యా! మానుమొక్కఁ-డర-హరిపై ద్వేషము మనమున॥
* అయ్యా! త్రోయకయ్యా-మనవి
వెయ్యివిధంబుల-వేఁడెద మరిమరి॥ అయ్యా॥
సృష్టి స్థితిలయకారణు-డిష్టుఁడుగాఁడే మనకుఁ
* స్రష్టను బొడ్డున-సృష్టించినట్టి యా
విష్ణునివైరము-కష్టము-నష్టము॥ అయ్యా॥
సకలచరాచరపాలుఁడు-ప్రకట దీనమందారుఁడు
వికలమతివి-సుఖమెరుగవు-విడువుము-సుకరమె? హరిపగ॥
నేనను యహంకారము-కానిదిజుమ ఘనులకైన
* మానుఁడు మానుఁడు-మనమెంత యా చక్రి
చే నాఁడుచున్నట్టి-తోలుబొమ్మలమెంచ॥ అయ్యా॥

హిర:—(చటాలున లేచి) అదుగో! ఆ వాదమే వద్దనుచున్నది. ఛీ! ఛీ! క్రూరుఁడా!

బంగాళా—ఏకతాళము

ఎవ్వఁడురా దేవుఁడు-క్రొవ్విమీరి వాగెదవిక॥ యెవ్వ॥
నవ్వులాట లనుకొంటివో-నాదరినా నీవాదము॥ యెవ్వ॥

నాకపరాధముసల్పిన-యాకలుషాత్ముని పేరు-ఛి
రాకుగల్గఁ బొగడెదవా-నీకిది పొగరా?
యీకరణిని నాయహితుని-నాకు గొడుకవై పెద్దగ
తేకువవిడనాడి కొల్వ-లోకులు వగరా?
ఛీ కలుషాధమ! నీపనిఁ జేయించెద నీనాలుక
గోయించెద-నీచెంపలు-వ్రేయించెద-ని న్నోతను
ద్రోయించెద-హా! హా!॥ ఎవ్వ॥
కంటఁబడ డేడిరా? తుంటరి యాదొంగచక్రి
వెంటాడక-పసఁజూడక విడుతునటర ప్రాణముతో
బంటుఁదనముతో సురులనుఁ బట్టించితిరా-యిడుములఁ
బెట్టించితిరా-తపసులఁ గొట్టించితిరా-జగముల
మట్టించితిరా-తొన్ని జేసినఁ రాడా-పన్నగశయనుఁడుమగతన
మున్నఁ రారాదా? బలమున్నఁ బోరరాదా? నే
కన్నులెఱ్ఱఁజేసిన లోకంబులు గడగడలాడును
మున్నె సగముచచ్చి మూలనున్న తులువఘన తేమిటి॥ఎ॥

(బాలునియెత్తి విసరివేయుచున్నాడు)

లీలా:—(బిగ్గరగా నేడ్చుచు) అయ్యో! అయ్యో! ఇదియేమ్మికర్మము. జీవితేశ్వరా! మీకు మతిలేదా? కసుగాయ నిటుల దండింపవలసినదేనా? కాసింతయైనా జాలి గలుగకున్నదా? పోనీ! పుట్టిననాడే వధియింపకపోతిరా? హా! దయావిహీనా! ఇట్టి సుకుమారు-నీ సుందరశరీరు-

నీ లలితవాత్సల్యబాహువు-నీ బాలభక్తుని కరుణింపవా? నాకు పుత్రభిక్ష మొసంగవా?

కాఫీ—చతురశ్ర

మనవిని వినుమా-మది కృపఁగొనుమా॥ మన॥
తనయునిపైని-పగఁగొనఁ దగునా॥ మన॥
పదములఁబడి కేలు-ప్రార్థనసల్పెద
వదలుము నైచీ-వరకుసుమారుని
* ముదమున నాటలఁబోదలెడు ప్రాయము
మూఢుఁడితఁడు పంక మేమియెఱుఁగును
కదనమునను పగతురపైఁజూపెడు
గాఢయత్నకఁ జూపఁదగునె? బుధుతఁడు॥ మన॥

తే॥ గీ॥ పంచవర్షముల్గడువని । బాలుఁడితఁడు
మంచిచెడ్డ గ్రహించెడు । మనసుగాదు
యితఁడేమియెఱుంగు ని । ర్భీతహృదయ!
మంచిచే మతిమార్తుకు । మించుమయ్యా!

హిర:—ఏదీ! ఆవెట్టికూడ తీర్చుకొనుము. జాలము మాత్రము తనికిరాదు. నేటితో వీనియంతముఁ జూడ వలయును.

లీలా:—(బిడ్డను కౌగలించి) నాతండ్రీ! నాగారాల కూచీ! ఈకఠినులు నిన్ను బాధింప నేను చూడలేనురా! పసితనమునందే నీకింత భక్తి యెందుకురా బాబయ్యా!

నామాట లాలింపవా? నీ శరీరమున దెబ్బ పడినప్పుడే నా ప్రాణము లెగిరిపోవును. సందియము లేదు. నీకు మంచి దుస్తుల నిప్పించెద. మీ బాబయ్యగారికి దయఁగల్గ పాద ములఁబడి వేడవా? నా కానందమునుఁ గూర్చవా? నన్ను విచారజలధినిఁ ద్రోయకుమా! నా చిట్టివిగాదూ! నా కోరికఁ ద్రోసివేయుదువా? నా నాయనా! నా తండ్రీ!

(ముద్దిడును)

ప్రహ:—అమ్మా! దుష్టుల చెంత వసియించుటచేత నీకు కూడా మతి మారుచున్నదిసుమా! నీకు తనయుఁడ నైనందున మెచ్చి చేయుమన్న చేయుదునుగాని, యీపట్ల నన్ను క్షమింపుము. నా లోకరక్షకుని, నా ప్రాలి బాబ య్యను మరువలేను. అయ్యో! మరువలేను.

లీలా:—అటులైన నీ కష్టములఁ జూడలేను. విష ముఁద్రాగి ప్రాణములు విడిచెదను. నీకు సమ్మతియేనా?

ప్రహ:—నా సమ్మతియేమిటి? త్రిలోకరక్షకుని సమ్మతినైనఁగాని ప్రాణములు విడువఁదలంచిననూ విడువ వమ్మా! వెర్రితల్లీ! నీకు సహస్రవందనములు. నా ధ్యానమార్గమున కడ్డురాకు. నా మతి చలింపనీయకుము.

లీలా:—అటులైన నన్ను చింతాబ్ధినిఁ ద్రోయ వలసినదేనా! నా ప్రాణములు నీ కొరకు పరితపించవలసిన

కేనా? హా! ఎంతదారుణమురా తండ్రీ! నన్నేలబుట్టించి తివో భగవంతుడా! (నేలఁబడుచున్నది)

ప్రహ:—(తల్లిని లేవనెత్తి) ఇదియేమమ్మా! ఇంత విచారముఁ గల్పించుకొన్నది నాకొరకేనా? అయ్యో! భయము లేదమ్మా! నాకు భయము లేదు లే

(కన్నీరుఁ దుడుచుచు)

జాలికాంభోజ—మిశ్రజాతి

కంటనశ్రులు-గారగా వా-ల్గంటి యేటికి-యేడ్చెదమ్మా
యింటికేగుము భయము లేదమ్మా-నా బాధమాన్పగ
తుంటవిల్తుని తండ్రిగలఁడమ్మా-అమ్మా॥ కంట॥
రాతిలోఁగల కప్పలను యట-వీతలంబున నుండు చెట్లను
ప్రీతితోడుత నెవఁడు పోషించె? యాధారమగుచును
యాతఁడే చేయూతయగునమ్మా-అమ్మా॥ కంట॥
అండమున-పిండాండమున-బ్రహ్మాండమునఁగల చిద్విలాసుఁడు
నిండుదయ నాయండనున్నాడే-నాస్వామి త్రిభువన
మండలంబుల నిండియున్నాడే-శరణన్న భక్తుల
యండవిడువక నుండునన్నాడే-నావంటిదీనుల
గుఱిదెసిరై గావనున్నాడే-నో రెండనడలకు
గండుదనుజ-హారుండు గలఁడా-కొండతాలుపు-నాకు
తోడుగ॥ కంట॥

ఎంచఁగాఁ పరీక్షించఁగా-తర్కించఁగా-గనుపించఁడాహరి
మంచిగురి నార్జించినఁ గాని-పంచేంద్రియంబుల
వంచి కడుసాధించినఁ గాని-మదిలోనిశత్రుల
జంచి వేగదహించినఁ గాని-లోచూపున మితము
కాంచి నేర్పునఁ గాంచినఁ గాని-తనలోనె తాను ర
మించి జ్ఞానము బొంచినఁ గాని- శంకించకమ్మా
కాంచనాంబరు-డంచితముగ-చరించు నాయెడ॥ కం॥

హిర:—(చటాలున లేచి లీలావతిని త్రోసివేసి) ఛీ ఛీ! నిర్భాగ్యురాలా యిట్టి దరిద్రు నెటులఁగంటివే? వీడు నాకు జన్మించినవాడేనా? కాడు కాడు. పులికి రెండైన పిల్లి బుట్టునా? వద్దన్న కొలఁది జోలపాడెద వేల? దవ్వులనిలు. దరి కేగితివా? నీ శిరమింక కొబ్బరిపువ్వువలె పైకెగురఁగలదు. పొమ్ము. దూరముగానేమ్వము. (రాక్షసులనుఁజూచి) ఓ కింకరులారా! రండు రండు. యీ శాత్రవ డింభకుని కనికరమువీడి మర్ధింపుఁడు. అలసించితిరా మీరు దండింపఁబడుదురు. శూలంబులచే వీనిం బొడువుఁడు. రంపములచే వీని నడ్డముగఁ బడవైచి తెగగోయుఁడు. కత్తులచే వీని రొయితలు ఛేదింపుఁడు.

(కింకరులు ప్రహ్లాదునిఁ బడవైచి పొడుచుచున్నారు)

ప్రహ:—(హరిస్మరణ మొనరింపుచు) అయ్యలారా! పొడువుఁడు. పొడువుఁడు. ఈ స్థిరముమాలిన రోతతనువు

నిప్పుడే నరికివేయుఁడు. శక్తియున్నంతమట్టుకు యోపికఁ బూని పున్నెముఁగట్టుకొనుఁడు.

నము:—(వగర్చుచు) అమ్మయ్యా! వీఁడి తస్సా గొయ్యా! ఉక్కుదేహముగాబోలును. శూలములన్నియు విఱిగిపోయినవి గాని వీని దేహము కందనైనను లేదుగదా!

(ఆశ్చర్యమునొందును)

లీలా:—(తనలో) ఉన్నాడున్నాడు. నా బిడ్డ పాలిటి రక్షకుఁడున్నాడు. తండ్రీ! నిగమాంతవేద్యా! వట్టిదిగాదు నీ మహిమ గట్టిదే! దిక్కులేని నా బిడ్డకు నీవే దిక్కు. అడ్డుపడ నా చేత నేమియుగాదు. ఏమి చేసి ననూ లోకరక్షకా! నీదే భారము. (నమస్కరించును)

శకు:—నముచీ! శంపములతోడనూ, కత్తులతోడనూ యింకొకపట్టుఁబట్టి చూతము రమ్ము.

(బాలునిబడవైచి నరుకుచున్నారు)

ప్రహ్లా:—(నారాయణస్మరణఁ జేయుచు) కింకరులారా! మీ సామర్థ్యమింతేనా? మీ చేతులందును కత్తులయందును చేవలేదా? చురుకుగా పనిచేయరేమి?

నము:—(విసుగుకొనుచు) అబ్బబ్బా! చెమ్మటబట్టినదిరా! ఇంక లాభము లేదు. నెత్తిని చేతులిడుకొని పైకి జూచియొక్క దండముపెట్టడమేమనపని. ఆయుధములే తెగనప్పుడింకేమి చేయము. వీ డెవడో మంత్రగాడు కాబో

లును. మనకు ప్రయోగంచేసి చంపఁడుగదా? ఏమైనా సరే యింక. వీనిజోలికి పోరాదు. (ప్రభువునకు నమస్క రించి) మహారాజా! ఓపికగలవర కేడ్చితిమి. ఇంకేమి చేయము.

హిర:—(తెల్లబోయి నిట్టూర్పువిడచి) ఆ! ఏమిటీ విపరీతము! మేము బాధించుచున్నదిక్కూడ వీనికి తెలియ కున్నదే? సుంతయు వెరువడేమి? వీడింకఁ గడతేరు మార్గ మెయ్యది? నముచీ! నీవేగి పాములవాని నొకని త్వరగాఁ బిలుచుకరమ్ము.

శకుని:—(తనలో) ఏమో! పాములుమాత్రము పనిఁజేయునా? ఇటునటు కాలినడక దండుగ్రయే యను కొనెదను. (పోవుచున్నాఁడు)

ప్రహ:—(శరీరముమరచి గంతులువైచుచు) అదుగో! మా రత్నాలబాబయ్య గంతులువైచుచున్నాడు. ఆహా! విశుద్ధప్రకాశకిరణములను దశదిక్కుల నెటుల ప్రకాశింపఁ జేయుచున్నాడో! బ్రహ్మానందము. బ్రహ్మానందము.

సీ॥ అదె! మఱ్ఱియాకుపై । నాడుచు నున్నాడు
చిఱుతఁడై వార్ధి పై । చికలమీద
నదె! పొర్లుచున్నాడు । యానందరూపుఁడై
పలునోళ్ళుఁగల శేష । పాన్పుమీద

నదె! లచ్చితో నవ్వు । లాడుచున్నాడు
గగనసౌధాగ్ర భా । గంబుమీద
నదె! జగత్పాలన । కరుగుచున్నాడు
ఖగనాథుడగు బొల్లి । గ్రద్దమీద
తే॥ గీ॥ అదుగో! గొంతుచున్నాడు బ్ర । హ్మాండమనెడు
మంటపంబున యిదుగో! నా । కంటిముందు
అహహా! మాతండ్రి లేని తా । వరయఁగలదె
వివిధచరము లచరములం । విష్ణుమయము॥
[అంత ఠకుని పాముల బంగారయ్యతో వచ్చును]
బంగా:—(ప్రభువుకు నమస్కరించి) దొరుగోరికి దండాలండి బాబయ్యా! ఏలినోరేయి కారణంసేత తొరగా రమ్మని సెలవిచ్చారోసొప్పండి. నాసాయిరంగా!
హిర:—ఒరీ! నీదగ్గర ముట్టినంతమాత్రముననే మట్టిచేయఁగల గొప్ప విషసర్పము లేమైనఁగలవా?
బంగా:—లేకేమి భాభో! మాబలే పామ్ములలున్నా యండి దొరుగోరూ! ఇదుగో సెప్పతినండి. (వ్రేళ్ళు మడచుచు) కొండతాసా, కోడిదాసా, తెల్లదాసా, నల్లదాసా, కాటికిముట్టితాసా, గబ్బితాసా, యెంటికంటితాసా యెఱ్ఱతాసా, అగ్గిదాసా, ఆదినారాయణదాసా, సుక్కతాసా, సూరేతాసా, కత్తిపొడ, కోమటోరి పెళ్ళికొడుకా, మిడినాగు, ముండితోకనాగు, మల్లినాగు, కండల్నాగు, గబ్బిడా

ల్నాగు, కాటిపొడ, పొట్టపింజరి ఓరబ్బో! యీలాంటి రకాలు సేనాసేనా వున్నాయండి సాయిగోరూ!

హిర:—అటులైన యేదీ! గొప్ప విషసర్పముచే యీకుఱ్ఱవానిని గరిపించిచంపుము. నీకుబహుమతిచేసెదను

బంగా:—కుఱ్ఱదొరగోర్నినాండి సంపుకోవడం. ఎందుకుసంప్తాలండి? సంపుకుంటే పాపంగాదుటుండీ! ఈ అబ్బాయిగోరేయిసేశారండి బాబయ్యా!

హిర:—(కోపముతో) ఓరీ! నీ కధికప్రసంగ మేటికిరా! సత్వరం నీపనియేదోచూడుము. లేకున్న దండింపఁ బడుదువు.

బంగా:—కోప్పడకంటిదొరుగోరూ! ఒక్కపోటుతో గుక్కెడురత్తం గక్కించి టక్కుని నేలఁబడేసే తాసుని దీస్తాను సూడండి పెబువుగోరూ! (పాములపెట్టె మూతఁ దెరచి) ఇదిగోనండి సిత్తగించండి. దీన్ని శంకరగిరిమన్నేల్లో పట్టుకున్నానండి. మొన్న మొన్నే పూస మిడిసిందండి. మాశౌరింగల పామ్మిల్లండి భాభో! నాగుసార మట్టానంటే నాటకందోక్కాలండితోక మీఁద లేసి. (బుఱ్ఱనూదుచున్నాడు)

ప్రహ్లా:—(నవ్వుచు)

బారువా—చతురశ్ర

పామునేజూపిన-స్వామిని మరతునె
పాములవాఁడా! పద పదరా॥ పామం॥

నీమనముఁగల్గిన-నా మనసాహరి
నా-మనము-మరు-వదు-నినుఁగని-వెరు-వదు॥ పాము॥
కామకోటి సుందరునిఁ-ని-ష్కామువి మందరధరునిఁ
సామజవరమని-సోమ దనుజహరు
కోమల పదములఁ గొల్చితిరా
పాములనాయకు-పానుపుఁ గల నా
స్వామి నన్ను విడనాడఁడురా-ఏమిచేయు నీ
పాములు నన్నిక-ఏ-రా-క్ర్యా-రా-లే-రా-పో-రా॥ పా॥
వెఱ్ఱియూసఁబడిపామును రేపకు-వెఱ్ఱివాడ!నీపనివృథరా!
బుఱ్ఱనూది రేపిన యంతనె యది-బుస్సు మనునటర
యోకులటా! చట్టునపైఁబడి-నిన్నే గరచును-సమయము
దప్పినప్రాణముఁగాచుకొ-అట్టుఁద్రిప్పినావంకఁజూడదు-
అల్లనుగో! భుజగవైరి గమనుఁడు॥ పాము॥

బంగా:—అబ్బో! యేందయ్యో!ఇది యీని మంత్రాలు సేరిసినిగుంటడుగాబోచు దొరగోరూ! పాము లేవదేంటండి సాయిూ! ఉండండి. మీాదబడేసి కరిపింతాను. (పామునుఁ దీయబోవ తన్నే కరచును) ఉస్. అబ్బబ్బా! నన్నే యే సేసిందండిబాబయ్యో! అమ్మయ్యో! అప్పిడే యిసం నడి నెత్తికొచ్చింది దొరగోరూ! మీా బగుమతీమాటఁ దేముఁ డెరుగును. నాపానాలు పోయేట్టొచ్చిందిసాయిూ! ఇంటికి పరుగేసు కెల్లి మారంగిని మంత్రించమని యేమందో మాకో పెందలాడే సూసుకుంటాను బాబయ్య! (పరుగెత్తుచున్నాడు)

శకు:— పాపం! వీడి జాతరే యయింది. ఈ బాల భక్తునిజోలికిఁబోతిమా! ఇంక మాంపనికూడ యింతలోనిదే!

హిర:— (తెల్లబోయి) హా! చోద్యము. భటులారా! ఇంకేమి యుపాయము?

నము:— ఉపాయమింకేమున్నదండి. ఉపాయముల కాలోచించిన మన కపాయ మగునేమో!

హిర:— నముచీ! నీ వెందైన నరిగి యొక గిన్నెడు గరళమును సత్వరఁ గొనిరమ్ము.

నము:— ఇంకెక్కడికిపోనండీ నానెత్తిమీదికి-తమ కేమిటీతిక్క-? దానికిమాత్రము చస్తాడా యేమిటి? మధ్య మమ్ముచంపడానికి చేస్తున్నారంతేతమరు-(పోవుచున్నాడు)

లీలా:— (తనలో) ఆహా! నారాయణుని మహిమ మాశ్చర్యము. నా బిడ్డకింక భయములేదు గాని నాథుని విషయమై భయమగుచున్నది. స్వామీ! త్రిలోకరక్షకా! నీచిత్త మేమిచేయనున్నదో- (నమస్కరించుచున్నది)

హిర:— అకటా! ఎన్నికష్టములుపెట్టినను రాయివలె నున్నాడుగదా! విషముమాత్ర మీతనియెడఁ బని చేయునా? ఆనారాయణుఁడింతకాలమునకు నాకంటఁబడ యత్నము చేయుచున్నాడేమో! కానిమ్ము. నాకంటఁబడి యాతుంటరి బ్రతికిపోఁగలఁడా? వానిగుండెలఁ దొబ్బలతోఁ గారు చిక్కని నెత్తురును నాలోన దహించుచున్న కోపాగ్ని

ఛల్లారచేరలతోదాహముజుట్టునా? నా కరాసి కాతులువను కండలుకండలుగా బలిఁజేయనా? ఎన్నఁడో యననేల? ఆ దంభవేల్పు--ఆ పిరికిగోవిందుడు--ఆ దొంగవేసాలమారి-ఆ బక్కవేల్పుల నాశ్రయించి మిడుకు యీ టక్కరినారా యణుఁ డిప్పుడు నాకంటఁ బడరాదా? పెక్కు దురంబులం దారితేరి యుక్కుమిగిలియున్న నారెక్కలమధ్య గదియించి కిక్కురుమనకుండ నొక్కిచంపనా? వానితనువు చెక్కనా? నెత్తురుఁ గ్రక్కించనా? (పైకిఁజూచి) హా! హా! రాడేమి? వచ్చినచచ్చును. సందియము లేదు.

[అంత నముచి గిన్నెతో విషముఁ దెచ్చుచున్నాడు]

ప్రహ:—(చూచి సంతోషముతో) ఓహో! మా సాయనగారికి నాయం దెంతకరుణయో! మిగుల డస్సియున్న వాఁడనని దాహమునుఁ దెప్పించినారా? (గిన్నె చేత నందుకొని) ఆహా! మీగడలుదేరినపాలు (త్రాగుట నభినయించి) యెంత మధురముగానున్నవో! పంచదారనుఁ గలిపించిరి కాబోలును.

నము:—(ఆశ్చర్యముతోఁ జూచి) ఆకో అంతనూత తీరిపోయినదిగదా! ఇంక నెత్తిపై చేతులిడుకొని ఆకసము వంకఁజూచి యొక్క నమస్కారముఁ జేయుదము.

ప్రహ:—పాలించుక యోపిక నిచ్చితివి. స్వామి భజనఁ జేసుకొనియెదను. (గంతులు వైచుచు)

ఫీలువా—త్రిశజాతి

నీ-కరుణరాదో! నిగమగోచరా! భవహర॥ నీక॥
దీనపాలకా! నాదిక్కు- నీవెగా-దా- వా-దా- శ్రీ
దా! నారదగానలోల! మానితగుణజాలా॥ నీక॥
నీ-వాశ్రితహితుఁడవనీ-విపదాబ్ధిదాట నీ-చేయూ
త మేలనీ-బుధులనఁగ వినీ-ముదముఁ గొని
నామది నీ-పై నిడితిని॥ నీక॥
ఇది సమయమురా! నామది నీయదిరా!
ముదమునుఁ గొనిరారా! నగుమోముఁజూప వేరా?
మదశజ్జనక-నీపదముల-కుద్ధురుగ నెదఁదాల్తురా
* ఇందిరమానసలోలా-బసవేంద్రదాస పరిపాలా!
ఎందుకుజాలము రారా-శుభాంగ-సుందరాకార
పతంగ-తురంగ॥ నీక॥

హిర:—(తనలో) ఈద్రోహి కడతేరుమార్గ మిం కేదియును లేదా!

తే॥ గీ॥ ముంచితిఁ వార్ధి గదల మొ । త్తించినాడ
గరళమిప్పింతిని కడు । కఠినమైన
శూలములఁ బొడిపించితి । సుంతయేని
అమ్మయనఁ డబ్బయనఁ డేమి । యద్భుతంబొ!

ఇం కేమిచేయను. వీనియొడ నేదియో ప్రభావమున్నది. గట్టిగా చూపుమని వాదముఁజేసినను యాతులువ చూపఁ

గలఁడు. సందియము లేదు. ఆహరియే నా కంటఁబడిన కృతార్థుఁడనే. శాత్రవానీకంబులఁ గలంచిన నాభీకరాసి కొక్క చీరిక కై నాజాలునా? యాచక్రి-వాని ప్రేవుల మాంస ఖండలతోఁ ద్రెంచి త్రిజగభీకరంబుగా నాయురంబునకు జన్ని దంబులు జేయనా? మదకరికుంభంబుల న్విదలించు కొదమ సింగంబు వడువున యా గోవిందునిపై కురికి మూర్ధంబు నవియఁదన్ననా? (ప్రహ్లాదునిఁజూచి) అర్భకా! కప్పరచి నటుల విరామము లేక హరీ! గిరీ! అని వదరెద వేల? హరి యెవఁడు? ఎట్టివాఁడు? ఎందుండును?

ప్రహ్లా:—జనకా! ఎందుండుననసేల? ఎందుజూచిన నందేఁగలఁడు. విశ్వమున యాతఁడు లేనిదేది? విశ్వమే యాతఁడు.

హిర:—ఛీ! ఛి! వట్టిమాట. ఆనిర్భాగ్యుని కొరకు ఱేకుఁబూని త్రిజగములు వెదకితిని. వెదకించితిని. ఆ పిరికి దొంగ యెన్నఁడు నాకంటఁబడఁడు. పడలేఁడు.

అమీరుకళ్యాణి—త్రిశజాతి

ఏడిరా? నీ-దేవుఁడు-యెందున్న వాఁడు॥ ఏడి॥
వాడి-ఖడ్గ-ధార-శిరం-బూడ-వ్రేతు-నేఁడు-చూడు॥ యే॥
ప్ర:-అలుకన్ గొనకయ్యా-నా-పలుకుల వినుమయ్యా-యా
చిలుక వాహనుని తండ్రిని-జనకన్ దరమా? తమకింత
కావరమా?

హి:-* చాలుచాలు నింక ప్రేలెదవా? నీసామిని
యాఖగగామిని-నీయజమానుని-దనుజవిదారినిఁజూపుము॥
ప్ర:-పటాటోపములకు వెరువఁడు
హి-అటులా? చూపుము-హుటాహుటిగ-దృఢబలిఁగొందుగ
ప్ర:-సరిలే-కటికిదనుజ మథనుఁడుజుమ-గడ్డిపోచగా వతనికి
హి:-కుటిలుని నా-కఠినకటారిగ-బటాపంచలుజేసెద॥ ఏడీ॥
ప్ర:-ఎందుకు గర్వముజనకా! మందరగిరి ధరునిపై
చిందులఁద్రొక్కుట ఘనమగునా?
హి:-* ముందుగ నీ తలఁద్రుంచెద నో గ
ర్వాంధుఁడ! యాహరి రాగలఁడా?
వంద యూవలికిఁ బోఁగలఁడా?
ప్ర:-సందియమేటికి? నా గోవిందుఁడు లేనిదిగలదా?
హి:-ఎందున్నాఁడుర? వాఁడు-
ప్ర:-అందరిలో నున్నాఁడు.
హి:-* ఎందుకు తర్కములా
డెదు నాకీ-స్తంభమునందునఁ జూపెదవా?
యిందేఁ జూపకుండిన నీ ప్రాణము-లెగురుగ-పొగరుగ
యెగురుగ-ఖలమతి॥ ఏడీ॥
(ప్రహ్లాదుని స్తంభముదరికీడ్చుకొనిపోయి) మదాం
ధా! ఈ స్తంభమునందు జూపెదవుగా! యా దొంగచక్రిని-
లేకున్న నిన్ను చిరచిరగ ద్రిప్పి యా స్తంభమునకు వ్రేసి నీ

తల టెంకాయవలె పగుల వ్రేయనా! ఏడిరా? నీ ముల్లోక విహారి——నీ సకలాంతర్యామి——నీ కల్లవిష్ణుఁడు——నీ బొల్లి విష్ణుఁడు——హా! కనుపరచవేమి? ఉండిన యిందూడిపడుమను-

(స్తంభమును అరచేత వ్రేయుచున్నాఁడు)

[స్తంభమును పెకల్చుకొని నరసింహుఁడు ప్రత్యక్షమగును]

నర:——(ప్రహ్లాదునిఁజూచి) ఓహో! మ్రుక్కడి శత్రుసానీకము మధ్య పెక్కుడుమలఁ బడుచు నా నామ రూపంబుల నీలో మరువకుంటివిగదరా కుఱ్ఱా! సెబాస్! సెబాసు! వైరిదనుజ వర్గభయదంబుగ నిట్టు దండించిన దనుజాధమునిగుండెలవియఁ గ్రుమ్మవచ్చితిని. భయము లేదు. నీకింక భయము లేదు.

నము:——(చూచి గుండెలు బాదుకొనుచు) ఏమి చిత్రమిది బాబయ్యా! స్తంభము పగులఁగొట్టుకొని యూడి పడింది. గుండెలఁదీస్తానంటదేమిటి? మృగమా! మనుష్యుఁడా!

శకు:——ఓరి వెఱ్ఱిమొగమా! ఈయన దేవుఁడురా! ఇంక మన ప్రభువుగారు దొంగిరిపోతారన్నమాటే- సందియము లేదు.

నము:——ఇన్నాళ్ళవరకు వైభవములఁ బొందినాము గాని యింక నేటితో మనపని సరి. మునుపు మన హిరణ్యాక్షప్రభువుగారి నిటులే బికారీరూపముతో వచ్చి తెగఁ గ్రుమ్మింది. ఇప్పుడదేమాదిరిలో మరొకవిధంగా తయా

రయింది. ఇంకేమైనాగానీ ప్రస్తుతం కాలిసత్తువఁ జూపక తప్పదు. (భటులు పారిపోవుచున్నారు)

నర:—ఓరీ! దురాచారాగ్రేసరా! దుర్గర్వాంధకారప్రమత్తహృదయా! ఏతీరా నీదిక్కని విసుగులేక వాగిన నీ ఫాలికి మిత్తినై నేడే నీ రక్తనాళంబులఁ ద్రెంచి దాహశాంతిఁ జేసుకొనవచ్చితిని. ఎగిరిపడవేమి?

హిర:—(తనలో) కాలము మారినదికాబోలును. నా తాళముఁబట్టుటకే యీతఁడీవిధముగా తయారైనాఁడు. సగము నరుఁడు, సగము సింహము. వీఁడు తన నిశితనఖములచే నాఁడొక్కఁ జీరుటకేకాబోలును. ఖడ్గాది యాయుధంబులనైనఁ గొనకుండవచ్చినాఁడు. ఘడియక్రిందట నాకుఁ దోచిన భయంకరస్వప్న మిదియేకాబోలును. వీఁడు బలే టక్కరిదొంగ. నా వరములకు వ్యతిరిక్తముగానే తయారైనాడు. ఏమైనఁగానీ! శక్తికొలఁది రిపుని సాధింపఁజూచెదను. (ప్రకాశముగా) ఇంతవర కెచ్చట డాగితివిరా! టక్కరిగారడీఁడా! సిగ్గులేకతగుదునని నేడెటులరాఁగల్గితివి?

నర:—ఓరీ మూర్ఖుఁడా! అన్నితావుల నమరియేయున్నాను. నిన్ను మరి మరి మిట్టిపడఁజేయుచున్నాను. నీ కాలపత్రములఁ జించుచునేయున్నాను. విధాతవరముల నిన్నాళ్ళు పాలించితినేగాని, నీకువెరచి డాగియుండలేదురా! తుచ్ఛుఁడా?

హిర:--అటులైన నాతో పోరుటకే సిద్ధమైవచ్చితివా?

నర:—పోరుటకేగాదు! నీసతి మెడపుస్తెం ద్రెంపుటకే వచ్చితిని. నేటితో నీ యాటసరి. ఇదిగో! నీరక్తంబునందు మునుగుటకున ఖబల్లెముల నెంతదృఢముగాం బెంచితినో!

లీలా:—(తనలో) హా! నాకింక పసుపుకుంకము లేదుకాబోలును. అయ్యో! నా జీవితేశునివధ నెటుల చూడఁగలను! (తలవాల్చి యేడ్చుచున్నది)

కదనకుతూహలము—ఏకతాళము

హిర:--పొగరున నాతో-జగడము-జేయఁగ
తగునునంచువచ్చితివా? అగుపడు నీ
మగతనమిక-యొగసిపడక-నిలు-నిలు-నిలు-నిలు-నిలు॥

నర:—పాపీ-నిన్ భువి మాపీ-కలుషము బాపీ-మహిమన్
జూపెదరా? ఓపఁగలవ? పసఁజూపఁగలవ? నిను
రాపెదనేలన్-జూపెదలీలన్ ॥ పాపీ॥

హిర:--నిలు నీ-పలు మా
యలు నా-దరి నా-గవు నీ-చేవన్-జూపుమురా

నర:—ఖలమతి కన్నుఁ-దెరువుము నన్నుఁ
గనుమిక నిన్ను-శా జేతున్

హిర:--కరాసివిసరెదఁ గాచుకో

నర:—దురాన నీగతిఁ జూచుకో

హిర:--బిరానఖండింతుర్

నర:—నీ-నరాలఁ దెగ్రదెంతుర్-ఛీఛీ॥ పా॥

(కలియఁబడుచున్నారు)

నర:—(హిరణ్యాకశిపునిఁ గ్రిందఁబడవైచి) హా దురాత్మా! చిక్కితి విం కెక్కడికిఁ బోయెదవురా! ముజ్జగంబు లోహోహాయన నీ గర్వంబు సర్వంబుఁ గ్రక్కించెదరా రాక్షసాధమా! ఇంక నీ పనియైనది. ఎగిసిపడవేమి?

హిర:—(తనలో) హా! ఇంక నన్ను నరసింహుఁడు కడతేర్చును. యేకాలమునందైనను శేనను గర్వము పనికిరాదు. అయ్యో! బాలభక్తున్ని నానావిధముల పీడించిన నాబోటి నిర్భాగ్యున కీపాటిశాస్తి కావలసినదే! కానిమ్ము. ఏమైనను సాధ్యమైనంతవరకు పెనగులాడెదను.

(పెనగులాడుచున్నాడు)

నర:—(అక్కునఁ గదియించిపట్టి) ఇంకెందుకు మిడిసిపడెదవురా? నీ పోతరముగాల. నాసునిశిత నఖ ఖల్లంబుల నీ ప్రేవులు లాగకమానను.

మోహన—త్రిశజాతి

కండలో-గుండెల్-నలిగ్గా-ఖండించెదరా

వెయింఢీ-శిఖండీ-నా-యందర్-దండన-బొందుము॥ కం డా

త్రిజగారి! నీ కాలము-దీరినదిక తులువా!

అజగరశయనుఁడు నన్నెవ్వాఁడని దలఁచితివో

వృజినంబుల బొడిగ బెట్టు-వెడగులపాలిటి కాలుఁడ
భజించు నా-భక్తుని నల-యించితివి-నశించుమింక॥ కం॥
కపటమతీ! నీకొరకై-కంబమున దాగిచితిరా!
కృపారహిత! నీ జీరక-కోపము తరుగదురా
ఇపుడే ప్రేగులలాగెద-నెవఁడడ్డంబైనమాన
విపులకోపశాంతికి ద్రా-వెద నీ-చిక్కని-నెత్తురు॥ కం॥

(పొట్టఁజీరి రక్తమునుఁ ద్రాగుచున్నాఁడు)

లీలా + ప్రహ:—(కరములు మొగిచి)

పున్నాగ—త్రిశజాతి

శాంతిఁబూనవే నృసింహా! శత్రుభీకరా॥ శాంతి॥
మంతనమున భయముగల్గె-మామనోబ్జ-బంభరా॥ శాం॥
కనులవహ్ని గ్రక్కుకు లో-కములు-మిగుల-బెగడెహో!
దనుజగర్వముడిగెనిక యా-దరమున నుముఁగనుమా
నిను వేదములే నుతింప-నేరవు మే మెంత
అవఘా! సాలోక్యమిచ్చి-యాదరించు-మిసుమంత॥ శాం॥

దండకము

శ్రీనారసింహా! మదారాతిసంహార! నిన్నెన్న దేవేశు-
తేజాలరో యన్న-మాశక్యమే కన్నతండ్రీ! మహారక్కసాళీ
తమంబుల్పటాపంచలై [illegible] దయాదృష్టి మాకెవ్వరిక
[illegible] [illegible] సాధిలోకేశ్వరున్నా
రమో యయ్యా! [illegible] దేవ [illegible]
[illegible]

ప్రఖ్యాతచారిత్ర! పాపాటవీ వీతిహోత్రా! విపద్బంధ జాలంబులఁ జెండగా లవిత్రా! పవిత్రా! భక్తిమార్గంబునే యెంచు-మాచిత్తముల్ యెన్నఁడున్ భవద్దివ్యపాదారవిందంబులన్ మగ్నంబులై యుండు దేవా! మహాముక్తి నీవా భవాబ్ధిన్ దరింపంగ నావ-కృపాదృష్టి నీదివ్యసాయుజ్యమునఁ జేర్చుకోవా? మహాత్మా! నమస్తే. నమస్తే. నమస్తేనమః.

నర:—(ప్రహలాదునిఁగని) భక్తాగ్రగణ్యా! నీకింక భయము లేదు. ధన్యుఁడ వైతివి. పదునాల్గు లోకంబుల నీవంటి భక్తుఁడు మరియొకఁడు లేడు. నీకు నీవేసాటి. కొలది కాలంబు యిహసుఖంబుల ననుభవింపుచు నన్ను మరువక కాలక్షేపముఁ జేయుము. తదుపరి నాసన్నిధియొసంగెదను. అమ్మా! లీలావతీ! కడుదురాత్ముండగు నీపతి మడిసినందుకు విలపింపకుము. నీ కన్నడమ్ము లిద్దఱును తొల్లి నాద్వారపాలకులగు జయవిజయులని యెరుంగుము. గర్వాతిశయంబున మహాభక్తులగు సనకసనందుల నిరసించి వారి తీవ్రశాపానలంబునదగ్ధులైరి. మూడుజన్మంబులవరకు నాకు శత్రులై నాచే కడతేరి తుదకు నా నివాసంబున కేతెంచగలరు. నీకును కొన్నాళ్ళకు నా సాన్నిధ్య మొసంగెదను.

లీలా:—మహాప్రసాదము.

(అందరు నిష్క్రమింతురు)

ఓం శ్రీరమేశమంగళం.

సమాప్తము.



# కృతిసమర్పణ

భక్తిత్రోవఁ జరించిన । భక్తవరుల
సత్కథాజాలములు హరి । సమ్మతములు
గాన నీకృతి రత్నముఁ । గౌతుకమున
నంకితముఁ జేసినాడ రా । మార్పణముగ

మ॥ రా॥ శ్రీ వెలగల సుబ్బారెడ్డిగారిచే రచియింపఁబడిన

# గ్రంథములు

| | | |
|---|---|---|
| 1 | రంగనాథ నామసంకీర్తనలు | రు 0—8—0 |
| 2 | ప్రహ్లాద హరికథ | 1—0—0 |
| 3 | మదనగోపాలశతకము | 0—2—0 |
| 4 | ధృవచరిత్ర హరికథ | 0—12—0 |
| 5 | దసరాపద్యములు (శ్రీకృష్ణలీలలు) | 0—1—0 |
| 6 | సుబ్బరాడ్జ్ఞానరామాయణము | 0—2—0 |
| 7 | పరమార్థప్రబోధము | 0—4—0 |
| 8 | వైకుంఠైకాదశీవ్రతప్రశంస | 0—4—0 |
| 9 | ప్రచ్ఛన్నక్షత్రియకులప్రబోధము | 0—8—0 |
| 10 | వెలగల సుబ్బారెడ్డిగారి కీర్తనలు | 0—1—0 |
| 11 | డిటో రెండవభాగము | 0—1—0 |
| 12 | ముకుందశతకము | 0—2—0 |

వలయువారు:—

శ్రీ వేణుగోపాల భక్తలీలామృతలహరీ గ్రంథనిలయము

మార్టేరు, పశ్చిమగోదావరిజిల్లా

(అస్ప్రాయుడు)



